# గృహలక్ష్మి




# GRIHALAKSHMI

15th MAY 1960

Vol. 29

No. 8

40 nP.

౧ ౯ ౬౦



కంకణ గృహీత, కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టరు శ్రీమతి కే. శారదాదేవి, గృహలక్ష్మి సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్య మున్నగువారు; ... చిత్రము.

## కేసరిగారి జన్మదినోత్సవ దృశ్యాలు



1960 సం॥మునకు శ్రీమతి కానుకొల్లు చంద్రమతికి గృహలక్ష్మి స్వర్ణకంకణమును బహూకరించినప్పటి చిత్రము




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతీమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణి!

వ్యవస్థాపకులు :
డాక్టరు కే. యన్. కేసరి

ఎడిటర్ :
సి. సి. పున్నయ్య

# డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవం



పూజ్యబాబు కేసరిగారి జన్మదినోత్సవం, అదే సందర్భమున గృహలక్ష్మి స్వర్ణ కంకణ ప్రదానం ఏప్రెలు 26వ తేదీన జరిగాయి. ఈ సందర్భము మాకు మహా పర్వదినమనడానికి అనేక కారణములున్నవి.

మహిళాభ్యుదయాన్నుద్దేశించి 'గృహలక్ష్మి' పత్రికను స్థాపించి నిర్వహించడంతోబాటు ఏటేటా స్వర్ణకంకణ ప్రదానమునకు పూనుకున్నారు. కేసరిగారు వ్యక్తిగతంగాను, మహిళా సంస్థలద్వారాను కేసరిగారు మహిళా లోకానికి చేసిన సహాయం, సేవ అపారం. ఇంకా బీద, సాదలు సయితం అనేకమంది వారి సహాయసహకారాలతోటి, అభిమాన వాత్సల్యాలతోటి తమ జీవితపురోభివృద్ధిని వివిధ రంగాలలో తీర్చి దిద్దుకోకలిగారు.

మద్రాసులో యీనాడు తెలుగు బాలలకని ఏర్పడిన కేసరి విద్యాలయములు

అవిచ్ఛిన్నముగా వర్ధిల్లడానికి కేసరిగారి 2 లక్షల రూపాయలు విరాళము, వానీ అభివృద్ధిపట్ల ఆయన చూపిన ఆసక్తి మూలకారణములని గంటాపథంగా చెప్పవచ్చును.

రాజకీయ, కళ, సాహిత్య రంగాలలో సయితము కేసరిగారి ఆసక్తి, వారు నిర్వహించిన పాత్ర జాతీయ పురోభివృద్ధిని ప్రోత్సహించడంతోబాటు ఉత్తమ కళాకారులను, కవులను, కవయిత్రులను, రచయితలను, రచయిత్రులను రూపొందించినవి. ఆయన కళాపిపాసి, ఆరాధకుడు, అభ్యుదయవాది కూడాను. ఆయన జీవితకాలంలో ఆదరాభిమానములకు పాత్రులమై, సేవించి, ప్రేమించిన మాకు యీ సందర్భమున శ్రద్ధాభక్తులతో అంజలి ఘటించి ఆయనకు జోహారులర్పించడం మహదాకాశం భాగ్యంకూడాను.

ఈ ఏటికి గృహలక్ష్మి స్వర్ణకంకణము శ్రీమతి కానుకొల్లు చంద్రమతిగారికి బహూకరించబడి, సత్కరించబడినది. శ్రీమతి చంద్రమతి సాహిత్యరంగంలో నిర్విరామంగా కృషి చేసినవారు. సరళమైన కవిత్వమును చెప్పడంతోబాటు ఉత్తమ రచయిత్రికూడాను. ఆమె రచనలు ఉత్తమ ఆదర్శలక్ష్యాలను ప్రబోధిస్తూ అభివృద్ధి అభ్యుదయాలను ప్రోత్సహించునవి. కవితా కుటుంబములో జన్మించినదగుటచే ఆ ప్రభావము ఆమెను సాహిత్యవనానికి ఒక పుష్పంగా అందజేసింది. కేసరిగారి అభిమానమునకు పాత్రురాలైన శ్రీమతి చంద్రమతి గృహలక్ష్మి స్వర్ణకంకణము స్వీకరించిన సందర్భమున హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము.



# న్యాయశాఖలో స్త్రీలకు ప్రాతినిధ్యం

ఆంధ్ర పబ్లిక్ వర్క్సు మంత్రి శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు యీమధ్య నరసాపురంలో ఉపన్యసిస్తూ దేశ సౌభాగ్య, సమాజ పురోగమన ప్రోత్సాహానికి, పరిపాలనా దక్షతకు స్త్రీలు పురుషులకంటె ఏవిధంగాను తీసిపోరని, నిశితమైన ఆలోచనలతోను న్యాయమైన అభిప్రాయాలతోను సంఘానికి అకుంఠిత సేవచేసి పురోగమిస్తున్న నేటి మహిళలకు న్యాయశాఖలోకూడ ప్రాతినిధ్యమిస్తే ప్రశంసనీయంగా నుంటుందనడం హర్షించతగినది.

న్యాయశాఖ సమర్థంగా నిర్వహించబడాలంటే శ్రీ రాజుగారు చెప్పినట్లు నిశితంగా ఆలోచించే శక్తి, ఓర్పు, వాస్తవికత కనుగుణ్యమైన అభిప్రాయాల వెల్లడి, ఎట్టి ప్రభావానికి లోబడని వ్యక్తిత్వము అవసరము. వీటన్నిటితోబాటు విద్యాయోగ్యత, శక్తిసామర్థ్యాలు గల స్త్రీలు యీనాటి అనేకమందికంటె న్యాయశాఖలో మెరుగ్గా రాణించి, మెరుగైన 'న్యాయాన్ని' ప్రజలకీయగలరు. కాబట్టి స్త్రీలు విశేషంగా న్యాయశాస్త్రాన్ని చదివి యోగ్యతలను సంపాదించడంతోబాటు ప్రభుత్వము వారికి అవకాశములను విస్తృతం చేయాలి!

# ఐతరేయోపనిషత్తు

పూజ్యపాద స్వామీ చిన్మయానందులవారి వ్యాఖ్యానములు-

అనువాదము: Dr. W. రాధాకృష్ణయ్య

(గతసంచిక తరువాయి)



ఎచ్చట కలిగెను? ఈ బ్రహ్మాండమంతయు, సృష్టింపబడెనుకదా! దానిలో నేనుకూడ ఒక అంశమయి యున్నాను. నా బుద్ధికూడ దానిలో చేరియున్నది కదా! ఈ బుద్ధి తన సృష్టిని, తన నాశమును తాను తెలిసికొనజాలదు." నా వీపుపై పడిన తేనెబొట్టును నేను, నా నాలుకతో నాకజాలను. అదేవిధముగ, విషయపూరితదృశ్య బ్రహ్మాండక్రమము బుద్ధికి గోచరమగుటలేదు. ఈ విచారించు బుద్ధికూడ ఈ బ్రహ్మాండమున చేరియున్నది. ఈ బ్రహ్మాండమును విచారించుటకే బుద్ధి ఒక ఉపకరణముగ నున్నది. అది తన స్వభావమును కొంచెము తెలిసికొనిన తెలిసికొనునుగాక. పిమ్మట ఆగిపోవును. తనకు తానుగ తన స్వరూపమును బుద్ధి గ్రహింపజాలదు. కనుక, బుద్ధినుండి మనము ఉపసంహరించవలెను. వెనుకకు మరలవలెను. బుద్ధిని అతిక్రమించవలెను. అప్పుడు విచారము బోధపడగలదు. శిష్యుడు బోధ పొందుటకు ఇట్టి పరివర్తనము పొందియుండుట అనివార్యము. పిమ్మటనే విచారము చక్కగ ప్రారంభమగును.

ఈ విచారమున తటస్థలక్షణమను న్యాయముపయోగింపబడియున్నది. "అదిగో! మేడపై కాకి కూర్చునియున్నదే, అదియే రామయ్యగారి ఇల్లు." ఇందు ఇల్లు, కాకి రెండున్నవి. వీటిలో ఇల్లు శాశ్వతము. కాకి కూర్చునియుండుట తాత్కాలికము. అయినను, ఈ తాత్కాలికముయొక్క సహాయమున శాశ్వతమును కనుగొన సాధ్యమగుచున్నది.

ఒకొక్క ఉపనిషత్తునందొకొక్క న్యాయమును తెలుపుటవలన, వ్యత్యాస దోషము కలుగుచున్నదని, పాశ్చాత్యులాక్షేపించుచుందురు. గురువులు తెలుపు కథలు వేరువేరుగ నుండినను, వారు సూచించు సత్యము అద్వితీయ శాశ్వత పరబ్రహ్మ మొక్కటిగాయున్నది. కథలు వ్యతిరేకించినను, అందు సూచింపబడు సత్యమున వ్యతిరేకములు లేవు. ఒక పసిబిడ్డ నిద్రపోవుటకు ముసలవ్వ యొడిలో పరుండును. అవ్వ బిడ్డను రొమ్ముమీద తట్టుచు కథలు చెప్పును. కథలు చెప్పకపోయినచో బిడ్డ నిద్రపోదు. కాని, ఒకదినము చెప్పిన కథను మరుదినము వినుటకు ఇష్టపడదు. వేరువేరుకథల వినగోరును. కథలన్నియు నిద్రపోవుటకొరకై కోరును. అన్ని యుపనిషత్తులు తెలుపునది సత్యము - ఏకము - అద్వియము. సత్యపరబ్రహ్మమునుండి ఈ బ్రహ్మాండ జగత్తు ఉద్భవించి, అతని ఆధారములో నిలచి, కడకు అతనియందే లయమగుచున్నది.

ఐతరేయోపనిషత్తు నందుపయోగపడు సామ్యమిట్లున్నది. ఆద్యంతరహిత పరమాత్మ సాంత ప్రపంచరూపమున వ్యక్తమగుచున్నాడు. కనబడునదంతయు పరమాత్మయే. వివిధరూపముల దృశ్యమగుచున్నాడు. ఒక బంగారుముక్క మెడలో అలంకరించుకొను గొలుసై తయారగుచున్నది. ఆభరణమనినను, గొలుసనినను, అదంతయు బంగారు తప్ప వేరు కాదు. గొలుసునందు బంగారు అనుస్యూతమై యున్నది. బంగారు లేకున్న, కంసాలి, కడ్డీని, తీగను, ఉంగరములను, గొలుసును క్రమముగ నుత్పత్తిచేయజాలడు. మొదలు బంగారు మాత్రముండెను. బంగారు క్రొత్తరూపములతో, ఆకారములతో కనబడుచున్నది. తండ్రియొక్క వీర్యము బీజరూపమున, తల్లిగర్భము ప్రవేశించి, మనుష్యరూపముగ తయారగుచున్నది. ఈ శరీరమంతయు, ఆ తండ్రి స్వరూపముగాక, వేరు కాదు. ఇందుగల క్రమవిధానము గురువు వివరించబోవుచున్నాడు. ఈ కథయందుగల రహస్యమును గ్రహించినచో, మన స్వస్వరూపము గ్రహించినట్లగును. సంశయములు తీరును.

నేను పరబ్రహ్మమునుండి కలిగియున్నాను. కనబడుచుండు ఈ విషయపూరిత దేహములన్నియు, ఆ పరబ్రహ్మము తప్ప వేరు కాదు. కాని, అనేక రూపాకారములతో కనబడుచున్నాడు. ఆభరణము బంగారుతప్ప వేరు కాదు. ఇదియే అపోపవాద మనబడును. దృశ్యప్రపంచమును సంపూర్ణముగ విమర్శించబడుచున్నది. దృశ్యమును విచారించుటవలన, అదృశ్యముకూడ విచారింపబడి, తెలిసికొనబడుచున్నది.

ఒక ఉద్యోగమునగాని, ఒక కళయందుగాని, ఉన్నతపదవిని చేరగలిగిన ప్రతిమహనీయుడు, తనకు గల ఆధారమేమి? ఈ మార్గమున తన్ను ముందుకు లాగుచుండు శక్తి ఏది? అని విచారించవలెను.

ఈ ఉపనిషత్తు, యోగ్యతగల సాధకులకు, విచారించు అభిరుచి గలవారికి, మనోబుద్ధులు పరివర్తనము పొందినవారికి, మాత్రము తెలుపబడును. పురుషబుద్ధి కలవారికీ మాత్రము తెలుపబడును. స్త్రీ పురుష వ్యక్తిభేదములు కావు. స్త్రీ బుద్ధి యనగా, విచారమును పట్టుదలతో అనుసరించజాలని బుద్ధి. అతి త్వరలో విరమించుకొనువారు. విచారశ్రమకోర్వలేని వారు, దీనిని గ్రహించజాలరు, ఇందలి విషయము గ్రహించుటకు అతి సూక్ష్మబుద్ధి అవసరము,

ఒకవ్యక్తి మనోబుద్ధుల ఆవరణము నతిక్రమించ గలిగినచో అతడు ఆత్మవేత్త యనబడును. అట్టివారు, తమ ఆత్మానుభవకాలమున, అనుభవోద్రేకమువలన, కొన్నిబోధలు పలుకుదురు. వారి పలుకులెల్ల, తమ అనుభవముల గురించి యుండును. అట్టి అనుభవములు శాశ్వతములైనవి. భూత, భవిష్యత్, వర్తమానములెల్ల, అందు నెలకొనియుండును. జగత్తంతయు అందుత్పత్తి పొంది, స్థితిగాంచి, అందే లయించుచున్నది. అట్టి ఆవరణమున తమ ఆత్మానుభవమునందు మహాఋషులు పలుకు వాక్యములు - అపౌరుషేయములనబడును. హిందూమతమే అపౌరుషేయ మనబడుచున్నది. ఏలన, ఇందు తెలుపబడు జ్ఞానబోధలెల్ల, శాశ్వత సత్యములు. ఋషులు తమ పరిపూర్ణ జ్ఞానానుభవమున పలికిన వాక్యములు. ఇందు "సర్వసామ్యములు మావి" (All rights reserved) అను వ్యవహారములు లేవు. "నేను పలుకుచున్నాను" అని వారు తెలుపుటలేదు. వారియందు "నేను-అహం" అనునది వెదకినను కనబడదు. వారి ఆనందానుభవమున కొన్నిమాటలు వారునుడివియున్నారు. అందువ్యక్తిత్వమున కాస్పదములేదు. అనేకమంది మతగురువులు తమ ఆత్మానందానుభవ సమయములందు, అత్యల్ప వయసుననే, దేహత్యాగము చేసియున్నారు. ఎందుకనగ, ఈ మృణ్మయ దేహము ఆ అమృతానందరసమును చాలకాలము సహించగల యోగ్యత లేకుండెను. అట్టివారు పలికిన విడివిడి వాక్యములవలన, వారి భావములను మనము గ్రహించవలెను. కనుక ఇందు సహానుభూతితో విచారము చేయవలసిన అగత్యము తెలియుచున్నది.

ఇందు నిమిత్తము, ప్రతి ఉపనిషత్తునకొక శాంతి పాఠము కలదు. శాంతి పాఠముతో విచారమారంభమగును. శాంతిపాఠముతో విచారము ముగియును. శాంతిపాఠమువలన, గురు శిష్యులకు సహానుభూతి, సమరసము, అన్యోన్యత చేకూరుచున్నది. శిష్యుల అంతస్థుకు గురువు దిగివచ్చి, వంగి, శిష్యులకు పైకి లేవదీయుచున్నాడు. బిడ్డ నెత్తుకొనుటకు తల్లి వంగవలసియున్నది. అదేవిధముగ గురువు మనోబుద్ధులతో నిమ్నుడై శిష్యుల యోగ్యతల కనుగుణముగ, తన మాటలను సవరించుకొని, వారికి ఉత్సాహము, అభిరుచి కలిగించి, ఉత్తమ పదవికి లేవదీయుచున్నాడు.

## శాంతి పాఠము

### 1వ భాగము

శ్రు|| ఓం. వాఙ్మే మనసి ప్రతిష్ఠితా. మనో మే వాచి ప్రతిష్ఠిత మావిరా వీర్మ ఏధి. వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీః. అనేనా ధీతే నాహో రాత్రాన్సన్దధా మ్యృతం వదిష్యామి. సత్యం వదిష్యామి. తన్మామవతు. తద్వక్తారమవతు. అవతు మా మవతు వక్తారమవతు వక్తారమ్.

ఓం. శాన్తిః! శాన్తిః!! శాన్తిః!!!

[హరిః ఓం. నా వాక్కు మనసున స్థిర పడునుగాక. నా మనసు నా వాక్కున స్థిర పడునుగాక. పరబ్రహ్మమా! నీవు నాకు ప్రత్యక్షము కమ్ము. ఓ వాక్కా, ఓ మనసా! వేదములు తెలుపు సత్యమును నేను గ్రహించునట్లు మీరు సహాయపడుడు. నేను వినిన విషయములు నన్ను వదలకుండును గాక! రాత్రింబగల్లు నేను అధ్యయనము చేయగలుగుదును గాక. నేను సత్యమును తలచుచుందును గాక. నేను సత్యమును పలుకుచుందును గాక! పరబ్రహ్మము నన్ను రక్షించును గాక! పరబ్రహ్మము గురువును రక్షించును గాక! నన్ను రక్షించును గాక! గురువును రక్షించును గాక! గురువును రక్షించును గాక!

త్రివిధశాంతులు మా కొనగూడును గాక!]

ఉపనిషత్ విచారము చేయుటకు పూర్వము గురు శిష్యులు అన్యోన్యభావము, సహానుభూతి పొందుటకు, తమ పరిశ్రమ నిర్విఘ్నముగ కొనసాగి, ఫలవంత

మగ పరిసమాప్తి యగుటకు, పరబ్రహ్మమునుగూర్చి, ఏకముగ ప్రార్థన చేయుదురు. ప్రార్థనయనగ, యాచించుట కాదు. గురువులెట్టి ఖ్యాతి నపేక్షించుటలేదు. తమ సమరసమును చూపుచున్నారు. శిష్యులెట్టి విషయలాభముల నపేక్షించుటలేదు. తమ సుగుణాభివృద్ధిని, సద్యోముక్తి నపేక్షించుచున్నారు. శ్రవణకాలమునందే, యోగ్యతగల శిష్యులు బ్రహ్మానుభవమును పొందగలరు. ఇందెట్టి శక్తిసామర్థ్యముల ప్రశంసలేదు. శాంతిపాఠ రూపమున పరమాత్మకు విన్నపము చేసుకొనుచున్నారు. దీనివలన వేదాంతము భక్తిమార్గమును ఖండించుచున్నదను దురభిమానము తొలగుచున్నది.

ప్రార్థనవలన ఆత్మ సంస్కారము కలుగునని ఋషుల భావము. అట్టి ప్రార్థన నేటి కాలమున, భక్తి యను పేరుతో, భగవంతునికి సుంకములిచ్చి, కార్యముల నెరవేర్చుమని నియమించు అవివేకముగ, కట్నములిచ్చిన భగవంతుడు కార్యముల ఫలము నొసగునని అమాయకుల మోసపుచ్చు వ్యవహారములుగ ఏర్పడియున్నవి. ఋషులట్టి విపరీతముల నూహించి యుండలేదు.

ప్రార్థనవలన మనయందలి అసాధారణ, సూక్ష్మ గుణాంశములు తేజోవంతమగును. బుద్ధిపూర్వక ఆత్మ శరణాగతియే ప్రార్థన యనబడును. శాంతియుక్తముగ, గౌరవనీయ ఆత్మార్పణము చేయుట నిజమగు ప్రార్థనయని శ్రుతులు తెలుపుచున్నవి.

ఈ శాంతిపాఠమున, పూర్వకాల మానవునికి గల విజ్ఞాన సంస్కారము ప్రకటితమగుచున్నది. శిష్యులకు చక్కని జీవితము, ఉన్నత ఆశయములు ఆవశ్యకములని ఆ కాలమున తెలిసియుండెను. ఈ చిన్న శాంతిపాఠమున విశేషపాఠములు కలవు.

సాధకుడు హృదయపూర్వకముగ పరమాత్మను వేడుకొనుచున్నాడు. భగవంతుని కటాక్షము పేక్షించుచున్నాడు. జీవితమున, తన మాటలు మనసునందలి ఆలోచనల ననుసరించుచుండవలెను. మనసు మాటలందు ప్రత్యక్షమగుచుండవలెను. అట్టి ప్రశాంతమును సాధకుడు కోరుచున్నాడు. ఇందలి కవిత్వము సౌందర్యముగ నున్నది. సామాన్య భావయందుకూడ భావములకు మాటలకు వ్యత్యాసముండకూడదు. వ్యక్తియందు బాహ్యము, అంతరము విభక్తముగ నుండరాదు. ఆలోచనలొకరీతి, మాటలొకరీతి యుండరాదు. మాట్లాడువాడు, అనుభవించువాడు నాయందొక్కడుగ నుండవలెను. శారీరక, మానసిక, వైజ్ఞానిక అంతస్థులందు భేదమేర్పడినచో మానవుడు పారమార్థిక సంపదాభివృద్ధి పొందజాలడు. ఒకనియందు, మాట్లాడు వాక్యములకు, ఆలోచించు భావములకు వ్యత్యాసము ఏర్పడినచో, అతని అంతర వ్యక్తిత్వమున ప్రమాదకర విచ్ఛేదము కలుగును. ఒక వాయిద్యము ఓటుబోయినచో, గాయకుడు దాని నుండి ఎట్టి స్వరమును గాని నుత్పత్తి చేయజాలడు.

“పరమాత్మా! నిన్ను కీర్తించు శక్తి నాకిమ్ము. నా మనసునందలి భావములను ప్రకటించగల శక్తి నాకిమ్ము. నా వాక్యములు, అనుభవములు, వ్యవహారము లేక రీతి యుండును గాక.” హృదయమునందలి ఆలోచనలు, వెలుపలవచ్చు వాక్యములు, శరీరమున కలుగు వ్యవహారములు అన్యోన్యముగ నుండవలెను. ఇట్టి సమరసము లేకపోయినచో, నిన్ను నీవు ఆశీర్వదించుకొనలేవు. వాక్యములు వెలువడునపుడు వాటికి హృదయబలము కూడి యుండవలెను.

“ఓ పరబ్రహ్మమా! నాకు ప్రత్యక్షముకమ్ము” - సాధకులు తమ నిర్మల జీవితమువలన మనోబుద్ధులందు సుగుణసంపన్నులై, గురుపాదముల వద్ద శ్రుతుల విచారమునకు యోగ్యత పొందుచున్నారు. కనుక వారు పరబ్రహ్మమును తమకు ప్రత్యక్షము కావలెనని కోరుచున్నారు. దైవికజీవిత ప్రవర్తనవలన కలిగిన, ఆత్మ నమ్మకమువలన, భగవంతుని నిర్బంధించగల శక్తి యొనగూడుచున్నది. కనుక వారు ఉత్తమఫలమును నూటిగ పరబ్రహ్మము నుండి కోరుచున్నారు.

ఒక రేడియోను, మనము తలచిన స్టేషనునకు తగువైనట్లు మరలు త్రిప్పియుంచిన వెనుక, ఆ స్టేషనునందు జరుగుచుండు కార్యక్రమములన్నెల్ల వినగల హక్కును నిర్బంధముగ కోరుచున్నాము. అదేవిధమున, ఒక సాధకుడు బాహ్యనమ్మక జీవితము గడపుటకు, ఆలోచనలకు, వాక్కును జతపరచినచో, అతడు ఆద్యంతరహిత శాశ్వత పరబ్రహ్మమును ప్రత్యక్షముగ కనుగొను హక్కును పొందగలుగుచున్నాడు. అట్టి పరబ్రహ్మము - ఆత్మ - మనోబుద్ధులను చీలదీయుటవలన ప్రత్యక్షమగును.

(సశేషము)

# రా జ కు మా ర్

ఫ్రెంచి మూలం :
ఆంటోనిడె సయంట్-ఎక్సుపేరే

ఆంధ్రానుసరణ :
డాక్టర్ వి. ఎస్. శర్మ



## ఇంతవరకు సాగిన కథా భాగం

[ రాజకుమార్ ఈ లోకంలో అడుగుపెట్టి ఇప్పటికి సంవత్సరమైంది. ఇక తిరిగి తన లోకానికి వెళ్లాలని తాపత్రయపడుతున్నాడు. ఇక్కడి వాతావరణానికి అలవాటుపడిపోయిన అబ్బాయి, అంతచప్పున ఇక్కడినుంచి ఎలా వెళ్లగలుగుతాడు !...కడపటి రోజు రానే వచ్చింది. అ రాత్రే అబ్బాయి ప్రయాణం. సూర్యాస్తమయానికి ముందు తన నేస్తం వచ్చాడు. అబ్బాయిని కలుసుకుని వాడితో కొంతసేపు కాలక్షేపం చేయాలని, తరువాత వాడిని తన మకాంకు తీసుకుని వెళ్లాలని. అతను అబ్బాయిని కలుసుకోటానికి వచ్చేటప్పటికి, అబ్బాయి ఎవళ్లతోనో మాట్లాడుతున్నాడు. నరపురుగూ లేని ఆ పరిసరాలలో ఎవళ్లతో అబ్బాయి ఇలా కాలక్షేపం చేస్తూవుండటం?...అటుకేసి చూశాడు. అబ్బాయి గోడమీద కూర్చుని క్రిందికిచూస్తూ మాట్లాడుతున్నాడు. క్రింద విషసర్పం తారట్లాడుతూ వుండటం నేస్తం చూశాడు...ఇక చదవండి. ]

I

రాజకుమార్ క్రిందికేసి చూస్తూ అంటున్న మాటలను విన్నానో లేదో నా దృష్టి చటుక్కున గోడ క్రిందికేసి మరలింది. గోడక్రింద తారట్లాడుతూ వున్నది పెద్దపాము. చారల పాము. ఇలాటి పాములు ఎడారి ప్రాంతాల్లో నివసిస్తూ వుంటాయి. అవి ఎంత ప్రమాదకరమైనవో నాకు తెలుసు. ఒక్కకాటు వేశాయా, ఎలాటి ప్రాణీ బ్రతకటం కలలోమాట.

అబ్బాయి అలాటి వాటితోనా ఇలాటి సమయంలో కాలక్షేపం చేస్తూ వుండటం!...ఇలాటి అవాంతరాలను ఎదుర్కోవాలసి వస్తుందనే ఎడారి ప్రాంతాలలో సంచారం చేస్తున్న సమయాల్లో రివాల్వరు నాతో తీసుకుని వెళ్లటం అలవాటు.... ఆ చారలపాము నా కంటబడ్డదో లేదో జేబులోనుంచి చప్పున తుపాకిని తీసి అటుకేసి గురిపెట్టబోతున్నాను. మామూలుకు మల్లె తుపాకి పనిచేసింది కాదు. లోపల చెడిపోయి వుండాలి. చక్కచేయటంలో కొంత ఆలస్యమైంది. పాము తుపాకి చప్పుడు పసికట్టి వుండాలి. ఇక అక్కడ వుంటేగా! ప్రక్కనేవున్న రాళ్లకుప్పల్లోకి మాయమైపోయింది....

అబ్బాయి ఈ దృశ్యాన్నంతా చూస్తూ గడగడ వణకిపోతున్నాడు. ఒళ్లంతా చెమట — ఏదో అనాలని ఆతృత పడుతున్నాడు. కాని నోటినుంచి మాట వస్తేనా!...గబగబ వాడు కూర్చున్న చోటికి చేరుకుని వాడిని గట్టిగా హత్తుకుంటూ "అబ్బాయి! ఎందుకలా భయపడుతావు...? ఇలాటి వాటితో చెలిమి చేయటం ఎంతో ప్రమాదము. సమయానికి వచ్చాను. లేకపోతేనా ..'' అని అదుర్దాతో అన్నాను. ప్రక్కనే మంచి స్థలం కనబడ్డది. అక్కడ పక్కవేసి వాడిని పడుకోబెట్టాను. త్రాగటానికి మంచినీరు తెచ్చి యిచ్చాను. దాంతో వాడు తేరుకుని నిద్రపోయాడు....

అలా నిద్రపోతున్నా గుండె దడదడ కొట్టుకుంటూ వుంది....అంటే? ఆ పాము చేయాలిసిన పని చేసే వెళ్లిపోయిందా?... లేకపోతే పాము అలా హడావుడిగా వెళ్లటం చూస్తూ మరేదైనా అపాయం వస్తుందని హడలిపోతున్నాడా అలా హాయిగా నిద్రపోతూ కూడా?

కొంతసేపయ్యాక అబ్బాయి కళ్లు తెరచి నాకేసి ఆదుర్దాతో చూస్తూ "ఎందుకలా దానిని భయపెట్టావు? అది చప్పున వెళ్లిపోవటం మంచిదే అనుకోవచ్చు...గురి దానికి తగిలివుంటేనా?...అది ఎందుకు నా దగ్గరకు వచ్చిందో...అదంతా రహస్యం. క్రమేణా నువ్వే తెలుసుకుంటావు..." అని మెల్లగా అంటున్నాడు.

"అప్పుడు నువ్వు పైన కూర్చున్నావే, తుపాకి పనిచెయ్యలేదని నీకెలా తెలుసు?" అని అబ్బాయిని ప్రశ్నించాను. చిక్కు మొహం వేసుకున్నాడు. అంటే ఇక మాట్లాడడు అన్నమాట – ఆరోజున అంత ఆదరాబాదరగా అబ్బాయి దగ్గరకు రావటం వాడికి ఎన్నో కబుర్లు చెప్పాలని. అలాటివాటిని వినటం అంటే వాడికి ఎంతో సరదా. కాని ఇవ్వాళ పరిస్థితులు ఇలా తారుమారై పోతాయని ఎవళ్లు అనుకున్నారు?

ఎంతసేపటికి వాడినుంచి పల్లెత్తు మాట అయినా వస్తేనా? వాడే కొంత సేపు విశ్రాంతి తీసుకున్నాడా మామూలు దోవకు తప్పక వస్తాడన్న సంగతి నాకు తెలుసు. నేనూ మరేమీ అడగకుండా కొంచెం వోపికపట్టి వాడి దగ్గరే కూచున్నాను. ఇలా ఎంతసేపు కాలచక్రం దాని పని చేసుకుని పోయిందో చెప్పటం అనవసరం.

ఇంతవరకు పడుకుని వున్నవాడు మెల్లగా లేచి కూర్చున్నాడు. "ఇవ్వాళ రాత్రికే మా ఇంటికి వెళ్లాలి...." అని అంటూ చప్పున ఆగాడు. కళ్లనుంచి నీళ్లు కారుతూ వున్నాయి. గడగడ వణకిపోతున్నాడు....పిచ్చిధైర్యాన్ని తెచ్చుకుంటూ "మా ఇల్లు ఎంతదూరమో తెలుసా?... అక్కడికి చేరుకోటం ఎంత బ్రహ్మాండమైన పనో...." తడబడుతూ అన్నాడు. మొహం పాలిపోతున్నది. అబ్బాయి ఇలా మారిపోవటం చూస్తూ హడలిపోయాను. ఏమిటీ పిచ్చిమాటలు?

అంతేనా? వాడి దృష్టి ఇక్కడ వుంటేగా! ఎందుకలా ఆతృతతో పైకి చూడటం? అలా ఆకాశమండలంకేసి చూస్తూచూస్తూ ఒక్క క్షణం నాకేసి తీవ్రంగా చూస్తూ "ఆరోజున నువ్వు ఇచ్చిన మేక ఎంతమంచిదో తెలుసా? అది వుండటానికి నువ్వు తయారుచేసి ఇచ్చిన ఇల్లు నాకు బాగా నచ్చింది. అంతేనా? మేక కోసం నువ్వు అల్లి యిచ్చిన చిక్కం ఎంత బాగా వున్నదనుకున్నావు!..." అని అంటూ, ఆ సమయమున వాడి బుర్రలో ఏంతట్టిందో ఫక్కున నవ్వాడు. అది మామూలుగా వాడు నవ్వే నవ్వు అయితేగా! అలాటి పిచ్చినవ్వు నేనెప్పుడూ చూసినవాణ్ణి కాదు. తరువాత ఏమంటాడో వినాలని కొంచెంసేపు ఓపికపట్టి వాడికేసి ఆప్యాయంగా చూస్తూ వూరక వుండిపోయాను. అలా నవ్వటంతో వాడి భయం మాయమైపోతుందనీ, దాంతో వాడు

మామూలు దోవకు రావచ్చని నా ఆశ.

ఎంతసేపు ఓపికపట్టివున్నా ఆ పిచ్చి నవ్వును అబ్బాయి మానితేనా? అంతేనా? పిచ్చివాడికిమల్లె వెర్రిచూపులను చూస్తూ, ఏమేమో గొణుక్కుంటున్నాడు.... ఇలా సాగనిస్తే తరువాత ఏమవుతుందో ఎవళ్లకు తెలుసు?

అబ్బాయిని గట్టిగా హత్తుకుంటూ "ఇదిగో అబ్బాయి! ఏమిటా వెర్రి చేష్టలు!.. ఎందుకో భయపడ్డావు! అంచేతనే ఇలా నవ్వు! వెర్రివాడిగా మారి పొయ్యావు. నేను వున్నానుగా...." అని బుజ్జగిస్తూ అన్నాను.

అబ్బాయి అందుకు ఒప్పుకున్నట్లు తల నూపుతూ చిరునవ్వు నవ్వాడు. కాని అది సహజమైన చిరునవ్వు అయితేగా! దాన్లో కూడా కనివిని ఎరగని వింత కనబడుతూ వున్నది.

అబ్బాయి నా వూహాలని అతి సులభంగా అవగాహనం చేసుకుంటూ, "దీనికే నువ్వు ఇలా అయిపోవడం చూస్తుంటే... భయపడ్డాను. అది నిజమే. ఇవ్వాళ రాత్రి దీనికి వెయ్యింతలు హడలిపోవాలసి వస్తుంది...." అని అంటూ గడగడ వణకి పోతున్నాడు. మొహం పాలిపోతున్నది... ఒళ్లు చల్లబడి పోతున్నది... ఇక పల్లెత్తు మాట వస్తేనా?

II

ఇదంతా ఏమిటి? వాడికి ఎలాంటి విషాదావస్థ రాబోతుంది? దీనిని ఎదుర్కొటానికి ముందే వాడు చిందరవందరై పోతున్నాడే! అలాంటి పరిస్థితులలో నా అవస్థ ఇక మాటలలో ఎలా వివరించ గలుగుతాను?

నా ప్లేను చెడిపోయింది యీ ఎడారిలో ప్రయాణం చేస్తూవున్న సమయంలో. నరపురుగు ఈ పరిసరాలలో కలికానికైనా కనబడటంలేదు. ఎటుచూసినా ఇసుక... పగలంతా వేడి. భరింపరానంత వేడి. సూర్యాస్తమయంతో చలి ప్రారంభం. ఇలాంటి నరకకూపంలో పడేటప్పటికి ఇక గతిమోక్షాలు లేవని అనుకున్నాను. అటువంటి సమయంలో నా జీవితానికి వెలుగుమల్లె రాజకుమార్ మరో లోకంనుంచి నా ముందట ప్రత్యక్షమయ్యాడు....వాడే ఆ సమయంలో ఇక్కడ వూడిపడక వుంటేనో?... ఆ సంగతి తలుస్తూవుంటే హడలిపోకుండా ఎలా వుండగలుగుతాను?

"నీ బుర్రని అలాంటి ఆలోచనలతో చెడగొట్టుకోటం ..." అని అబ్బాయిని సమాధాన పరచటానికి పిచ్చి ధైర్యాన్ని తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ అనబోతున్నాను. వాడు నన్ను మాట్లాడనిస్తేనా? చటుక్కున. నా మాటకు అడ్డు వస్తూ "సంగతి సందర్భాలు బాగా తెలిసే అలా అంటూన్నాను. ... ఇవ్వాళరాత్రికి సరిగా ఒక సంవత్సరమవుతుంది ఈ లోకంలో నేను అడుగు బెట్టి. అప్పుడు ఎక్కడ దిగానో అక్కడే నా కోసం నా గ్రహమండలం ఎదురు చూస్తూ వుంటుంది ... "అని గట్టిగా నిటూర్పు విడుసూ అబ్బాయి అన్నాడు.

(సశేషము)

# వింధ్యాద్రి గర్వభంగము

శ్రీ పేరి సర్వేశ్వరశర్మ



నారదమహర్షి నర్మదానదిలో స్నానంచేసి ఓంకారస్మరణ చేసుకొని నారాయణునిమీద పాటలు పాడుకొంటూ వింధ్యపర్వతాన్ని చూడటానికి వెళ్లాడు. వింధ్యపర్వతం ఎట్లా ఉన్నదంటే, స్థావర జంగమాత్మకములైన రెండు రూపములతోను వసుమతిని పరమ శోభాయమానంగా చేస్తూ, రసాల వృక్షాలచే పద్రసాలకు ఆశ్రయమై అశోక వృక్షములచే శోకమును పోగొట్టుచూ, తాల, తమాల, హింతాల, సాల వృక్షములచే అంతటా పరమశోభితమై, రొుత్తైన పోకచెట్లతో ఆకాశాన్ని అందుకొంటూ, మారేడు చెట్లచే పరమశోభను కలుగజేస్తూ, అగరు చెట్లచే పరిమళాన్ని వెదజల్లుతూ, వెలగపండ్లచే కోతివలె పింగళవర్ణము గల్గి, వనలక్ష్మి యొక్క కుచములా అన్నట్లు ఉన్న లకుచ వృక్షములచే మనోహరమై, అమృతరసాన్ని ఒలికించు రంభావృక్షములచే భాసమానమై, మంచి రంగుగల నారంజి చెట్లచే లక్ష్మీదేవియొక్క రంగమండపంలా ఉంటూ, వానీర, జంబీర, బీజపూరాది వృక్షములచే పూరితమై గాలిచే కదులుచున్న కంకోలతలచే, బహుస్త్రీలతో క్రీడించుచున్న పురుషునివలె వాయువుచే కొంచం కదిలిన కర్పూరపు అరటిచెట్ల ఆకుల సంజ్ఞచే అలసియున్న బాటసారులను విశ్రమించుటకు పిలుచుచున్నదా అన్నట్లు, కిసలయములనెడి చేతులతో పువ్వుగుత్తులనెడు స్తనములను మర్దనము చేయుచున్నదా అన్నట్లు అనంతములైన ఫలములతో శోభితములై గగనమును తాకుచున్న ఉదుంబర వృక్షములచే బ్రహ్మాండమునంతా భరించునట్టి శేషుడా అన్నట్లు ఉన్నది.

వింధ్యపర్వతము కోటిసూర్యసమప్రభుడైన నారద మహామునిని చూచి దూరమునుండియే లేచి యెదురేగి సాష్టాంగప్రణామముచేసి పిదప అష్టాంగ పూజావిధానముచే ఆయన్ని పూజించింది. సురమహర్షి కొంత తడవు విశ్రమించిన తర్వాత వింధ్యాద్రి సవినయంగా ఆయనతో ఇట్లు పల్కింది. ఓ సురమునిసత్తమా! నేడు నీ పాదధూళిచే నా సమస్త పాపాలు నశించాయి. నీ శరీరకాంతిచే నాలో ఉండు చీకటి అంతా పటాపంచలు అయింది. నేటికి నా జన్మ తరించింది. నా పుణ్యం ఫలించింది. నేడు సుదినము. సాక్షాత్తు బ్రహ్మ పుత్రుడవైన నీవు నాయందు దయ కల్గియిచ్చటకు వచ్చినావు. నాకిక పర్వతాలన్నింటిలోను ఉత్తమమైన స్థానం లభిస్తుంది. నారదమహర్షి వింధ్యాద్రి చెప్పిన మాటలన్నీ విని ఒక పెద్ద నిట్టూర్పు విడచాడు. అదిచూచి వింధ్యపర్వతం ఓ మహర్షీ, నీవీ విధముగా పెద్ద నిట్టూర్పు విడచుటకు కారణమేమి? నీవు సర్వజ్ఞుడవు. నీకీ ప్రపంచములో తెలియని విషయమంటూ లేదు. మరియొక మాట. నీ రాకచే గల్గిన ఆనందబాష్పములచే కంఠము పట్టుట వలన గద్గదస్వరము కల్గియుండుటచే మాటిమాటికి చెప్పజాలక ఉన్నాను. అయినను చెప్పుచున్నాను వినుము. సముదాయంగా పర్వతాల నన్నింటినీ భూధరాలని పిలుస్తారు. కాని యధార్థంలో నేనొక్కడనే భూమిని ధరిస్తున్నాను. అయినా హిమాలయాది పర్వతాల గౌరవానికి కారణం చెప్పుచున్నాను వినుము. హిమవంతుడు పార్వతీదేవికి తండ్రి, ఈశ్వరునికి మామగారు అగుటచేతను అందరిచేత పూజింపబడుచున్నాడు. మేరుపర్వతము సువర్ణమయమై, రత్నమయములైన చరియలు గల్గియుండుట చేతను, దేవగంధర్వాదులకు ఆశ్రయమై ఉండుట చేతను గౌరవింపబడుచున్నది. మిగిలిన పర్వతాలు వాటివాటి ప్రదేశములందే ప్రఖ్యాతిజెందియున్నాయి కాని జగత్ప్రసిద్ధములు గావు. వాటిని గూర్చి కూడ చెప్పుచున్నాను వినుము. ఉదయాచలము మందేహులను రాక్షసులకు ఆశ్రయభూతమై ఉన్నది. సూర్యుడు అస్తమించు పర్వతము అస్తాచలము. నిషధ పర్వతము, ఓషధులకు నిలయమై ఉన్నది. మందమైన ప్రకాశము గలది మంధర పర్వతము. మలయ పర్వతము పర్వములకు ఆశ్రయమై యున్నది. రైవత పర్వతము ధనరహితమైనది. హేమకూటాది పర్వతాల చివర పేరుకే కూటపదము ఉన్నదిగాని యధార్థంలో అవి బంగారం కలవి కావు. ఇక కిష్కింధము, క్రౌంచము, సహ్యాద్రి మున్నగు పర్వతాలు నామమాత్రానికే భూధరాలు

కాని అవి భూభారాన్ని భరించుటలేదు. వింధ్యాద్రి చెప్పినమాటలు విని నారదమహర్షి తనలో తానిట్లు అనుకొన్నాడు. ఓహో, వింధ్యాద్రికి ఎంత గర్వము! గర్వము కలవాడెప్పటికిని గొప్పవాడు కాజాలడు. దక్షిణదేశంలో ఇంకా గొప్ప పర్వతాలు లేవా యేమి. ఉదాహరణకు శ్రీశైల పర్వతాన్ని తీసుకుందాం. దాని శిఖరమును చూచినంత మాత్రముననే సత్పురుషులకు ముక్తిగల్గునే. తానేదో అన్ని పర్వతాలకంటె గొప్పదైనట్లు వింధ్యాద్రి గర్వోక్తులు పలుకుచున్నది. దాని బలమేదో నేడు చూడవలయునని ఆలోచించి ఈవిధంగా అన్నాడు. ఓ వింధ్య పర్వతమా, నీ మాటలు నిజమేనయ్యా, తక్కిన పర్వతాల సంగతి ఎట్లా ఉన్నా, మేరుపర్వతము మాత్రము నిన్ను అవమానించుచున్నది. ఆ విషయాన్ని స్మరించే నేను పెద్ద నిట్టూర్పు విడచాను. అయినా నావంటివానికి యిట్టి విషయాలలో చింత దేనికిలే అని చెప్పి కలహాశనుడు గగనమార్గము మీదుగా వెడలిపోయాడు.

తనను మేరుపర్వతము అవమానించుచున్నదని నారదమహర్షి చెప్పిన మాటలను తలచుకొని వింధ్యాద్రి మిక్కిలి చింతించి యీవిధంగా ఆలోచింపసాగింది. లోకంలో శాస్త్రకళావిహీనుని జన్మవలెను, ఉద్యమరహితుని జన్మవలెను జ్ఞాతులచే అవమానింపబడినవాని జన్మకూడ వ్యర్థము. అట్టివానికి భోజనము రుచించునా? రాత్రివేళ నిదుర పట్టునా? శత్రువులచే పరాభవింపబడినవారికి ఏకాంతమందు కూడ సుఖమెట్లు కల్గును! మనోవ్యాధివల్ల గల్గుమంట దావాగ్నికంటె కూడ దుర్భరము. ఏ రోగానికైనా మందు ఉన్నదికాని చింతారోగానికి మందులేదు. చింత అను రోగము ఆకలిని, నిద్రని, బలాన్ని అన్నింటిని హరిస్తుంది. ఇంతేకాక అది రూపాన్ని, ఉత్సాహాన్ని, బుద్ధిని, లక్ష్మిని చివరికి జీవితాన్ని కూడ హరిస్తుంది. ఈ రోగాన్ని రూపుమాపుటకు ధన్వంతరిగాని, చరకుడుగాని, అశ్వినీ దేవతలుగాని, ఎవరూ కూడ ఎట్టిమందును కనిపెట్టలేకపోయారు. అయ్యో మేరుపర్వతము నన్నవమానిస్తున్నదన్న చింత నన్ను పీడిస్తూ ఉన్నది. ఇప్పుడు నేనెచ్చటకు పోగలను. ఏమి చేయగలను. మేరుపర్వతమును జయించు ఉపాయమేమి. పోనీ ఒక్కసారి యెగిరి కసితీర దానిమీద పడదామంటే రెక్కలు లేవుగద. పూర్వకాలంలో మా పర్వతాలన్నింటికి రెక్కలుండేవి. కాని మా దురదృష్టవశంవల్ల దేవేంద్రుడు మా రెక్కలను తెగ నరికివేశాడు. ఇంతకీ మేరుపర్వతం నాతో స్పర్థ చేయుటకు కారణమేమి? కారణం ఏదీ కనపడదే. పోనీ నారదుని మాటలు తోసిపుచ్చుదామా అంటే ఆయన అనవసరంగా అబద్ధం ఎందుకు ఆడుతాడు. అయినా లోకంలో భారాన్ని భరించేవారంతా అజ్ఞానానికి ఆశ్రయభూతులు అవుతారని అంటారు. ఏమైనా సరే ఈవిధంగా చింతించడంవల్ల ప్రయోజనమేమీ కనపడదు. కావున ఈశ్వరుని శరణు వేడుకొంటాను. ఆయన శరణాగత వత్సలుడు. ఆయనే నాకు సద్బుద్ధిని ప్రసాదిస్తాడు, అని ఆలోచించి తిరిగి యీవిధంగా వితర్కింపసాగింది. పెరుగుచున్న రోగాన్ని, శత్రువును బుద్ధిమంతులు ఉపేక్షించ కూడదు. కావున యిక కాలవిలంబనం చేయకుండా యీవిధంగా చేస్తాను. సూర్యుడు గ్రహనక్షత్రాదులతో కూడి తన బలాధిక్యమును తలచినవాడై మేరు పర్వతము చుట్టూ ప్రదక్షిణము చేయుటకు బయలుదేరును గదా! నేడు మేరుపర్వతం గర్వం అడంచుతాను అని నిశ్చయించి సంగ్రామబుద్ధిగలదై స్పర్థతో వింధ్యపర్వతం అనంతమైన ఆకాశానికి ప్రాకారమగుచూ ఎత్తుగా పెరగసాగింది. ఇట్లు ఎత్తుగా పెరిగి పెరిగి దక్షిణోత్తర మార్గాలను పూర్తిగ అరికట్టి కృతకృత్యునివలె చింతావిహీనయై హాయిగా ఉన్నదై యీవిధంగా అనుకున్నది — ఇప్పుడు సూర్యుడు నా శక్తిసామర్థ్యాలన్నీ తెలుసుకొనగలడు. లోకములో మనుజులు ఎట్టి గొప్పవారైనా తమ శక్తిసామర్థ్యములను చూపనంతకాలము ఇతరులకు వారు చులకనగుదురు. కట్టెలో నిప్పు దాగి ఉన్నది గదాయని దానిని తాకుటకు ఎవరైనా భయపడుచున్నారా? నిప్పు ప్రకటితమైనప్పుడు గదా భయపడుచున్నారు, అట్లే మనలో ఎన్ని శక్తిసామర్థ్యాలున్నా అవి ప్రకటనమగువరకూ ఎవరూ మనలను పూజించరు, అని అనుకొన్నదై చింతభారాన్ని విడచి దృఢప్రయత్నయు గలదై సూర్యోదయాన్ని ప్రతీక్షిస్తూ ఉన్నది.

చరాచరాత్మకమైన జగత్తంతకూ ఆత్మస్వరూపుడైన సూర్యభగవాను డుదయాద్రిని యధిష్ఠించి తన వెయ్యి కిరణాలను ప్రసరింపజేసి నలుదిశలా వెలుగులు జిమ్మాడు. చీకటి తొలగింది. రాత్రి అంతా ముకుళించిన పద్మిని వదనం వికసించింది. సత్పురుషులు సంధ్యావందనాది సత్కర్మలందు ప్రవృత్తులయ్యారు. దేవతలకు హవ్యకవ్యాదులు ప్రారంభమయినాయి. యామినిచే భక్షింపబడిన జగత్తంతా

పునరుజ్జీవితమయ్యింది. సూర్యరథానికి కట్టబడిన ఏడు గుఱ్ఱములు వాయువేగ మనోవేగములతో రథాన్ని దక్షిణదిశగుండా లాగుకొని పోతున్నాయి. కొంత దూరం వెళ్లిన తర్వాత రథం ఒక్కసారిగా ఆగిపోయింది. గుఱ్ఱాలు ముందుకు నడవలేకపోయినాయి. మన రథం హఠాత్తుగా ఆగిపోవుటకు కారణం ఏమిటి సారథీ, అని అనూరుని అడిగాడు సూర్యభగవానుడు. ప్రభూ, వింధ్యపర్వతము గగనము పొడుగునా పెరిగి మన మార్గాన్ని అవరోధించి ఉన్నది. మీరు మేరు పర్వతము చుట్టూ ప్రదక్షిణము చేయుటను తాను సహింపజాలక తాను స్వయముగా ఆ ప్రదక్షిణను పొందవలయునను దురుద్దేశంతో మేరువుతో స్పర్ధ కలిగి మన మార్గాన్ని కప్పియున్నట్లు కన్పిస్తుంది. ఆహా! ఎంత ఆశ్చర్యకరమైన విషయము. ఆకాశ మార్గముకూడ అవరోహింపబడినదే అని సూర్యభగవానుడనుకొన్నాడు.

సూర్యుడెంత శూరుడైనా మధ్యమార్గంలో ఉండి ఏమి చేయగలడు? ఎంతవేగం గలవాడైనా తానొక్కడు అరికట్టబడిన త్రోవను ఎట్లా దాటగలడు? ప్రఖర కిరణుడైన ఈ సూర్యుడే అప్పుడప్పుడు రాహువుచే మ్రింగివేయబడుటలేదా? ఇంతకు విధి బలీయమైనది. సూర్యుడు ఒక సెకనుకు రెండువేల రెండువందల రెండు యోజనముల దూరం ప్రయాణం చేస్తాడు. అట్టివాడు నేడు వింధ్యాద్రి పెరుగుటచే గమనవిహీనుడై యున్నాడు. కొంతసేపు అగుసరికి తూర్పుదిక్కున కుబేరదిక్కున ఉన్న ప్రజలు సూర్యుని తీక్ష్ణకిరణములచే తపింపబడసాగారు. దక్షిణ దిశన, పశ్చిమ దిశన ఉన్న ప్రజలు జగత్తంతా అంధకారబంధుర మగుటచే ఇంకా సూర్యోదయం కాలేదనుకొని నిద్రించియున్నారు. కాని ఎంత కాలమని నిద్రిస్తారు. ప్రజలు పరస్పరము ఈవిధంగా అనుకొనసాగారు. అయ్యో! ఏమిటీ వైచిత్ర్యము. సూర్యుడు లేకపోవుటవలన పగలు లేదు; చంద్రుడు లేకపోవుట వలన రాత్రి లేదు. గ్రహనక్షత్రాదులు కూడ అస్తమించి ఉండుటచే ఇది ఏకాలమో కూడ తెలియకుండా ఉన్నది. ఈ బ్రహ్మాండమంతా కారణం లేకుండానే లయమగునా యేమి? స్వాహా, స్వధా, వషట్కారాలచే వర్జితమైన యీ జగతీతలమందు పంచయజ్ఞాదిక్రియలు లోపించుటచేత భువనత్రయమంతా కంపిస్తూ ఉన్నది. సూర్యోదయం వల్లనే యజ్ఞయాగాది సమస్తక్రియలు నడుస్తూ ఉన్నాయి. యజ్ఞాలు సరిగా జరుగుతే యజ్ఞభుక్కులైన దేవతలకు తృప్తి కల్గుతుంది. చిత్రగుప్తాదులంతా సూర్యోదయ, సూర్యాస్తమానాదుల చేతనే కాలపరిమాణమును తెలుసుకొనుచున్నారు. సృష్టి, స్థితి, లయములకు సూర్యుడే కొలతబద్ద. అట్టి సూర్యుని గమనము స్తంభితము కాగానే ముజ్జగములు స్తంభింపబడియున్నవి. ఎచ్చట నున్నది యచ్చటనే గోడమీది బొమ్మవలె చిత్రితమైయున్నది. ఒకప్రక్క కేవలము అంధకారము, వేరొకప్రక్క కేవలము సూర్యరశ్మి ఉండుటచేత చాలమందికి ప్రళయం సంభవించింది. మూడు లోకాలు శరణార్థుల శిబిరాలవలె తయారు అయినాయి, అని ఈవిధంగా వ్యాకులమనస్కులై యేడ్వసాగారు. సురాసురాదులు కూడ యీ విచిత్ర సంఘటనను చూచి కలతజెందినవారై బ్రహ్మవద్దకు పోయి వానిని వేయినోళ్ల స్తుతించారు. వారుచేసిన స్తుతికి మెచ్చి పితామహుడు మీకేమి కావలయునో కోరుకొనుడని చెప్పి మరల ఈవిధంగా అన్నాడు. ఓ సురాసురులారా! మీరు వచ్చిన కార్యమేదో నాకు తెలుసు. మేరుపర్వతముతో వింధ్యపర్వతము స్పర్ధగల్గి సూర్యమార్గమును అవరోధించియున్నది. దానికి ఉపాయము చెప్పమని మీరు నా దగ్గరకు వచ్చియున్నారు. ఉపాయము చెప్పుచున్నాను—సావధానంగా వినండి...మిత్రావరుణుల పుత్రుడైన అగస్త్య మహర్షి, సమస్త ప్రాణికోటికి ముక్తిని ప్రసాదించునట్టి అవిముక్త మహాక్షేత్రంలో తపస్సు చేస్తున్నాడు. అగస్త్య మహర్షి శక్తిసామర్థ్యాలు మీకందరకు తెలిసినవే. ప్రజలను మోసంజేసి భక్షించునట్టి వాతాపి, ఇల్వలుడు అను ఇద్దరు రాక్షసులను ఆ మహానుభావుడు తన పొట్టలో జీర్ణం చేసుకుని ప్రజలను రక్షించాడు. ఆయన సూర్యునికంటె తేజోవంతుడు. కావున మీరు కాశీక్షేత్రానికి వెళ్లి వింధ్యాద్రి గర్వంవల్ల ఏర్పడిన యీ మహోపద్రవమునుండి ప్రపంచాన్ని రక్షించమని ఆ మహర్షిని వేడుకొనండి. ఆయన తప్పక మీకు సహాయపడతాడు అనిచెప్పి పితామహుడు అంతర్ధానం జెందాడు. ఇంద్రాదులంతా తమకు ఈ రూపంగానైనా కాశీ దర్శన భాగ్యం లభిస్తున్నందుకు మిక్కిలి సంతసించారు.

(సశేషము)

# సీతమ్మ తల్లి

శ్రీ నడాదూరి విజయరాఘవాచార్యులు



జనని సర్వంసహాదేవి జనకుఁడఖిల
శాస్త్రగుప్తార్థ సిద్ధుండు సజ్జనాభి
రాముఁడాత్మేశ్వరుండుగ రాణమిగులు
నర్థి జనకల్పవల్లి సీతమ్మ తల్లి

విమల దుగ్ధాబ్ధి దేటిన యమృతరసము
హరియురము వన్నె పెట్టు ననర్ఘభూష
ఆగమాంతర్నిహితపరమార్థ చయము
అర్థిజన కల్పవల్లి సీతమ్మ తల్లి

విప్ర రసనాగ్ర మంజుల వేదఘోష
యల జనక రాజు పొందిన యజ్ఞ ఫలము
తరణి కులము వెల్గించు రత్నాలదివ్వె
యర్థిజన కల్పవల్లి సీతమ్మ తల్లి

ధర్మపత్నిత్వలబ్ధి కాదర్శరేఖ
శ్రీరఘూద్వహ హృదయ దయా
రసంబు

మదిని నత్రిగృహిణి మెచ్చు మణిశలాక
యర్థిజన కల్పవల్లి సీతమ్మ తల్లి

మహితగార్హస్థ్య ధర్మ ప్రమాణపంక్తి
పవనతనయ సుదృక్పుణ్య వర్ధనంబు
హుతవహుఁడు సోక వెలిచిన యుజ్జ్వ
లాంగి

యర్థిజన కల్పవల్లి సీతమ్మ తల్లి

పుణ్యజన యోషిదవన కారుణ్యరాశి
గర్భమున జంటము త్యాలఁ గన్న శుక్తి
యాద్యకవి మనః పరిపాకమైన కరుణ
యర్థిజన కల్పవల్లి సీతమ్మ తల్లి

సంశ్రిత జనాఘ కార్పాస సప్తజిహ్వ
విశ్వకారణుఁ బ్రకటించు వేదబుక్కు
హరిపరంజ్యోతిఁ దెల్పునధ్యాత్మవిద్య
యర్థిజనకల్పవల్లి సీతమ్మ తల్లి

---

# పెంకి పిల్లడు

ఒక సారి ఒక తండ్రి తన పిల్లలతో యిలా అన్నాడు. "ఒరే అబ్బాయిలూ! రేపు మీ అమ్మ వెన్నతోటి రొట్టి చేస్తుంది. ఎవరు తింటారురా ?"

"నేను తింటాను" అన్నాడొక పిల్లవాడు.

"మనం ఒక పందిని చంపబోతున్నాము. దానిని ఎవరు తింటారుర్రా"

"అదికూడా నేనే తింటాను" అన్నాడాపిల్లవాడు.

"రేపు మనం పొలంలోకి వెళ్తాము. ఎవరుదున్నుతారురా పొలాన్ని ?"

"బాగుంది, అస్తమానం నేనే ఎందుకు చెప్పాలి? తక్కినవాళ్లని మాటాడమను" అన్నాడా పెంకి పిల్లవాడు.

# మహాదాత

## (ఏకాంకిక)

శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

---★---

పాత్రలు

| | | |
|---|---|---|
| శ్రీ కృష్ణుడు | — | ద్వారకాధీశుడు |
| అర్జునుడు | — | పాండవమధ్యముడు |
| కర్ణుడు | — | దుర్యోధన సేనాపతి; అంగరాజు |

[అస్తాద్రికి ప్రస్థానించే అంశుమాలి అంతిమ కిరణాలు విశాల కురుక్షేత్ర రక్తరంజిత మైదానంలో ధరాశాయినయోధ వీరులకేసి దీనభావంతో చూస్తూన్నాయి. మహాదానవీయ రాజ్యలాలసా, రణరంగంలో అసంఖ్యాక భారతవీరులు బలిఅయిపోయారు. మహానాశనకరజ్వాల భారతదేశంలో కణకణ ప్రజ్వలితమై, వ్యాప్తమై అంతరాష్ట్రీయ ప్రదేశపర్యంతం నిజధూమ్రాన్ని చేర్చివేసింది. కురుపాండవ పక్షంలో యుద్ధమారంభమైన నాటికి పదునైదవరోజు కూడా గతించిపోయింది. ఇరుపక్షాల్లోని యోధులూ తమతమ శిబిరాలలో రాత్రిగడప సాగారు. విశాలకురుక్షేత్రధాత్రి రక్తరంజిత నరముండశవ. భరితమై, మృత పశువులతో, ఆఘాతులై అస్తవ్యస్తదశలోనున్న వారితో, భిన్నాభిన్న శస్త్రాస్త్రాలతో ఉత్పాదికవలె బీభత్సస్పృష్ట్యవతరణ చేయుగోరుతోంది. దశదిశలా నీరవత్వం సామ్రాజ్యమేలుతోంది. అప్పుడప్పుడు నక్కల కూతలూ, కుక్కల ఏడుపులూ, గ్రద్ద, డేగ, రాబొందు మొదలుగాగల మాంసాహారపక్షుల రెక్కలనుండియు బయల్వెడలు రెపరెప ధ్వనులూ, ఆఘాతవీరుల చీత్కారాలూ దశదిశావ్యాప్తమైన నీరవత్వాన్ని భగ్నం చేస్తున్నాయి. ఆ సమయంలో నిజకమల సదృశ పాదసంచాలనంతో సాగే శ్రీ కృష్ణభగవానుని పాండవ మధ్యముడైన అర్జునుడు అనుసరిస్తూంటాడు. వారిద్దరూ ఆబీభత్స సృష్టికి ఒక వైపునుండి వస్తూన్నట్లు కనిపిస్తారు.]

అర్జునుడు :-కృష్ణా ! ఇక్కడికి తీసుకొచ్చావేమిటి ?

శ్రీ కృష్ణుడు :-ఏం ! భయమేస్తోందా ?

అ :-భయమా! లేదులేదు పార్థుని పాణితలాన్ని గాండీవం విభూషితంచేయ, వాసుదేవుడు సహాయకారిగా ఉన్నంతకాలం ఆతడు జగత్రయంలో ఎవనికీ భయపడడు.

శ్రీకృ:-అయితే యిక్కడికి రావడంలో ఆశ్చర్యమేమి?

అ :-ఆశ్చర్యం కాదు దేవా ! ఖేదం.

శ్రీ కృ :-ఖేదమా ?

అ :-అవును ప్రభూ ! ప్రియజనుల యీ దశను చూస్తూంటే విచారమే కలుగుతోంది. నాయీ వజ్రసదృశమైన హస్తాలు పితామహభీష్మునీ, ఆచార్యద్రోణునీ, కర్ణమహావీరునీ, ఎదురు తిరిగిన యోధవీరునెవనినైనా సరే యమసదనం చేర్చగలవు గానీ...... నేత్రాలుమాత్రం నిజప్రియ జనులనీ దుర్దశలో చూడలేక పోతున్నాయి. మధుసూదనా...—యీ బీభత్సదృశ్యాన్ని చూడలేక పోతున్నాను.

శ్రీ కృ :-అర్జునా ! భావనాప్రవాహ ప్రవాహితుడవు కాదు. భావనకన్న కర్తవ్యం శ్రేష్ఠమయింది. ఆ గీతోపదేశం అంతా మరచిపోయావా ?

అ :-లేదు కృష్ణా ! భవదీయ సేవకుని గాండీవధ్వనుర్విముక్త శరాఘాత శత్రుశరీర మంకితమయినట్లే నీగీతోపదేశం నాస్మృతి నేమాంకితి మయి ఉంది..

శ్రీ కృ :-అయితే యీ మోహానికి కారణం ?

అ:-మోహమా ? మోహం కాదు దేవా ! ఈ దృశ్యాన్ని చూస్తూంటే నాశనభూతమైన క్షణభంగర జీవితమందు విరక్తి కలుగుతోంది, ఇంకా

కొన్ని క్షణాలిక్కడే ఉంటే నేను యీ భావన పై విజయం పొందజాలను.

శ్రీ కృ :-(మందస్మితంతో) పార్థా! విరక్తికలగదమా! నువ్వు చెప్పే విరక్తి చంచల ప్రవృత్తి కొక రూపు రేఖమాత్రం. అది స్వానుకూల పరిస్థితుల్లో హృదయగత సంచార భావ ప్రేరితమై మానవీయ విచార శృంఖలాలను జర్జరితం చేస్తుంది. వ్యతిరేక పరిస్థితుల్లో సౌదామినీ సదృశంగా లుప్తమైపోతుంది.

అ :-(ఆశ్చర్యంగా) కృష్ణా!

శ్రీ కృ :-అవును. అర్జునా! నడు ముందుకు నడు.

అ :-ఎక్కడికి నడిచేది?

శ్రీ కృ :-మహాదాతయైన మహారథి కర్ణ వీరుడు క్షత విక్షత గాత్రుడై పడి మృతదేవిని ఆహ్వానించే ప్రదేశానికి నడు.

అ :-'మహారథి-దానవీరుడు'-కేశవా! భవదీయ ముఖతః వెల్వడిన యీ శబ్దాలు కర్ణునికి యోగ్యాలై శోభాకరములైనవి కావు.

శ్రీ కృ :-ఎంచేత కావు? అర్జునా! నువ్వు కర్ణుని మహాధాతగా, మహావీరునిగా అంగీకరించవా?

అ:-కర్ణుడు మహావీరుడు కావచ్చు కానీ దానవీరునిగా, మహారథిగా నేను నంగీకరించజాలను కృష్ణా!

శ్రీ కృ :-(చిరునవ్వుతో) ధనంజయా! పొరబడుతున్నావు. యుద్ధరంగంలో రథచక్రం భూమిలోకి దించుకొనిపోగా పైకి లేవనెత్తుకొన ప్రయత్నించే యుద్ధ సన్నద్ధుడు కాని వానిని నువ్వు నిజ తీవ్ర శరాలతో క్షత విక్షత గాత్రుని చేసి నేల కూల్చినంత మాత్రాన అభిమానవశుడవై అతనిని మహారథిగా అంగీకరించలేక పోతున్నావు. ఆ మహాదాత భూడతనుడు కావడానికి భవదీయ పరాక్రమమే కాదు. అన్య శక్తులెన్నియో అజ్ఞాతంగా ఆధార భూతాలయ్యాయి. వీటన్నిటిమాటా దూరంగా ఉంచు. అతని పరాజయానికి ప్రధాన కారణమతని మహా దాతృత్వమే.

అ :-కృష్ణా! నీ మాటలమీద నాకు విశ్వాసం కలగడం లేదు.

శ్రీ కృ :-పార్థా! ప్రత్యక్షానికి ప్రమాణావశ్యకత లేదు. కనుకరా, నీకు కర్ణుని మహావ్యక్తిత్వాన్ని పరిచయం చేస్తా.

(తెర)

స్థానం :-కురుక్షేత్ర రక్తరంజిత మైదానం - అదే సమయం

(ఇద్దరు సాధువుల ప్రవేశం)

అ :-వాసుదేవా! యీ వేషంలో మనల్ని కుంతీమాత కూడా గుర్తించలేదు. మనం పూర్తిగా గా యాచక బ్రాహ్మణులవలె సాధు వేషంలో ఉన్నాం.

శ్రీ కృ :-అవును, అర్జునా? జాగ్రత్తగా ఉండాలి. అలా చూడు. ఎదురుగా అంగ నరేశుడు కర్ణుడు పడియున్నాడు.

(కర్ణుని సమీపిస్తారు)

ఇద్ద :-అంగరాజాకీ జై.

క :-(ఇద్దరినీ చూస్తూ హీనస్వరంతో) మహానుభావులారా! మీ రెవరో తెలియగోరుతున్నాను.

శ్రీ కృ :-కర్ణా! మేము యాచన బ్రాహ్మణులం.

క :-(లేచుటకై ప్రయత్నించి అసఫలుడై) భూసుర శ్రేష్ఠులారా! ధన్యుణ్ణి, జీవితాంతిమ వేళలో కూడా కర్ణుడు యాచక దర్శనంతో కృతార్థుడయ్యాడు. కాని మీ రిక్కడికి యీ వాతావరణంలోకి ఎలా వచ్చారు?

అ:-రాధేయా! యాచించవలసిన కార్యం గాగల మాకు సమయాలతో పనిలేదు. భవదీయులు దాన వీరత్వం కారణంగా విశ్వ విఖ్యాతి చెందారు. కనుక ఏదయినా పొందాలని ఇక్కడికి వచ్చాము. కురుక్షేత్ర రణరంగంలో ఆహుతులై మీరు పడి ఉన్నారనీ తెలిసింది. అదీగాక మహాదాత అని జగద్విఖ్యాతి చెందిన త్యాదృశుల అంతిమ దర్శనార్థం కూడా వచ్చాం. సంగర రంగంలోని భయానక దృశ్యాల్ని భయపడుతూనే చూస్తూ రాగలిగాం.

క :-(అత్యంత హీనస్వరంతో) సత్పురుషులారా! అత్యంత దయాపాత్రుణ్ణి. ఈ భీభత్స ప్రదేశంలో యిట్టి దైన్య స్థితిలో నేను మీకు చేయగలిగే సేవ ఏమిటో చెప్పండి.

శ్రీ కృ:-మాకు స్వల్పభారంకల సువర్ణం కావాలి.

క:-బంగారమా! కటకటా! అశ్వినీకుమార సదృశ తేజ సంపన్నులయిన యాచక భూసురులారా

యిక్కడ కాంచనమెలా దొరుకుతుంది? (దగ్గుతూ) ఇక్కడ కనుచూపుమేర దూరమంతా రక్తసిక్తం కావడం మీరు చూస్తూనే ఉన్నారు. మీరు నా మిత్రుడైన దుర్యోధనుని దగ్గరకు వెళ్ళగలిగితే మీ అభిలాష అవశ్యం నెరవేరుతుంది.

శ్రీ కృ:-అంగదేశాధీశా! విచారించకు. మీ కోరిక ఏమిటి! అని నువ్వు అడిగావు. కనుక చెప్పాము. లేనిచో యాచనా విషయమే లేదు. ఇప్పుడే స్వల్పకాంచనం కోసం కౌరవశిబిరానికి పోయి వ్యర్థంగా మీ మిత్రునికి కష్టాన్ని కలిగించ దలుచుకోలేదు.

అ:-అంగరాజా! విచారించకు. మాకు సెలవు.

(ఇద్దరూ నిష్క్రమించ యత్నం చేస్తారు)

క:-ఆగండి. ఆగండి. యీ సూర్యనందనుని యాచించి రిక్తహస్తాలతో ఏ యాచకుడూ మరలి పోలేదు. మీరూ మరలడానికి వీల్లేదు. అష్ట దృఖాంతర్గత స్వర్ణదంతంతో మీ అభిలాషను పూర్ణంచేస్తాను.

(అంటూ దంతంమీద ఖలంకొద్ది కొట్టి ఊడ బెరుకుతాడు. నోటినుండి రక్తధారలు తీవ్రంగా ప్రవహిస్తాయి. దంతాన్ని యాచకులకేసి పోనిచ్చి)

క:-తీసుకోండి కర్ణుని జన్మాంతిమ, చిహ్నన్నికూడా అవసానదశలో చివరిసారిగా రాధేయుని హస్తతలాన్నుండి తీసుకోండి... నేడు నేను - ప్రసన్నంగా ఉన్నాను. దాతృత్వ చరమసీమను ఆనందంగా...

శ్రీ కృ:-రాజా! ఛీ! ఛీ! బుద్ధిమంతుడవై కూడా యీ ఎంగిలి వస్తువును బ్రాహ్మణునకు దానం చేస్తున్నావా? యీయవల్ఛుకుంటే జలశుద్ధంచేసి యియ్య.

క:-జల...జలములా... యిక్కడ జలాలు లేవే! కాని... యాచకా... అదిగో నా... బాణం, బాణ గంగ... అవునవును. కష్టఃనుకోక ఆ బాణం... యిలా... యియ్యగలవా?

శ్రీ కృ:-ధనుర్బాణాలా! లేదు రాజా! రక్తసిక్తమైన వాటిని మేము స్పృశించజాలం. ఆ కార్యం చేసి స్వహస్తాలను దూషితం చేసికోలేం.

క:-(లేని ఉత్సాహాన్ని బలవంతంగా తెచ్చుకొని) సరే. మీరు - మీ చేతుల్ని దూషితం చేసికోకండి. కర్ణుడు స్వయంగా లేస్తాడు. (అంటూనే భూమిమీద పాకుతూపోయి తన ధనుర్బాణాలు తీసి అతిప్రయాసమీద శరసంధానంచేసి తీవ్రంగా పృధ్వీతలంమీద కొడతాడు. మరుక్షణంలో తీవ్రజలధారలు ప్రవహించగా తజ్జలాలతో స్వర్ణదంతం క్షాళితంచేసి యాచకులకేసి హస్తాన్ని సాగించి) యాచకులారా! యిదిగో... తీ... సి... కోం... డి... మీ కోరిక... నెరవేరింది.

అ:-అవును. కర్ణా! మా కోరిక నెరవేరింది. నీయందు నాకుగల అవిశ్వాసకళంకం యింతలో ధవళితమై పోయింది.

క:-(క్షణంలో కృష్ణార్జునులను గుర్తించి) ఆశ్చర్యంగా ఎవరు?... అర్జునుడవా?... ఆ... ఆ... నువ్వు... నువ్వు... శ్రీ... కృ... ష్ణు... డ... వా?

(కంపిత హస్తాలతో వారిద్దరికీ నమస్కరిస్తాడు)

శ్రీ కృ:-అవును కర్ణా! భవదీయ దాతృత్వ శంకితుడైన అర్జునునికి నీ వీరత్వాన్ని ప్రదర్శింపజేయ తీసికొని వచ్చాను. రాధేయా! నువ్వు ధన్యుడవోయీ. నీవంటి దానవీరుడుదయించిన యీ వసుంధరా మాత ధన్యమయిందోయి.

♦ ♦ ♦

[కృష్ణార్జునులు కర్ణునికేసి విహ్వల దృష్టి చూస్తూండగానే అంధకారమయనిశలోని ప్రథమతార పతనమై ఉత్తర దిగ్భాగంలో విలీనమై పోతుంది].

# తపోనిష్ఠ

విద్వాన్ శ్రీ యం. వి. ఆర్. కృష్ణశర్మ



రత్నాల కింకిణీ రశనంబుచే నొప్పు । కటినందుమౌంజినిఁ గట్టికొనియె
కందుకక్రీడన ఘనరక్తము నొందు । హస్తాబ్జమునఁ దాల్చె నక్షమాల
కస్తూరి కాంగణగములతో రాజిల్లు । దేహంబునెల్ల భూతిని నలందె
భ్రమరకాంతాద్యుతిఁ బరగు కుంతలతతి । మడమలంట నిడువౌ జడలుగట్టె

పసిఁడియంచుల యందంపు బట్టుచేలఁ
జాలవర్జించి వైచియా శైలబాల
నెమ్మిఁ బులిదోలు మొయిసినిత్యమ్ముఁదాల్చి
తపము నొనరింపు చుండెసద్భక్తి నెనయ

తపముసలుప వల్కలములఁ దాల్చినంత
గిరిజలావణ్య మొక్కింత దరుగలేదు;
అలిసమూహసంబంధంబు నందెకాక,
శైవలస్పర్శమున సరోజంబునొప్పె

హంస తూలిక పాన్పుపైన హరహంబు,
పవ్వళించు నప్పార్వతి యవ్వనాన,
బాహువల్లి తలాడఁగాఁ బరిపికొనుచుఁ
గటికరాలనేలఁ బరుఁడఁగడఁగెనామె.

పరమ శివదివ్య దీక్షావిభాసమాన,
భవ్యతేజోసమన్విత దివ్యమూర్తి
కాగిరిజకును శతవృద్ధులైన మునులు,
ప్రణతులొందురు భావి ప్రభావగరిమ.

కఠినతరతపంబుగావించు, యాత్మభి
లాషఁదీర్చుకొనఁ దలంచెనగజ
దేహమార్దవంబు ధృతిఁబూనితలఁపక,
సలుపుచుండెఁదపము నిలిపిమతిని.

కూర్మిత త్తపాగ్నుల మధ్యఁగూరుచుండి,
హాసముఖ సమవేతయై యద్రిజాత,
యరుణునరయుచున్నను, దుష్కఖాంబు
జంబు
పద్మశోభల విలసిల్లె వాడిపోక.

అటులఁబంచాగ్నుల నడుమఁ జటులతపము
నిటలనయను గూర్చి సలిపె సిరజాక్షి
యరుణకిరణతప్తమయి గ్రీష్మాంతమందు.
వర్షసిక్తమై నేత్రబాష్పములవదలె

కఠినపాషాణ తలములఁజటుల వృష్టి
కాలములశయించుచుఁ బర్ణశాలవీఁడి,
తత్తపములకు సాక్షులై తనరుచుండి,
నిశలు విద్యుదీక్షణములు నిలిచియుండె

ఆమె హేమంతకాలబు నరుగుదెంచి
నంత, గంతదఘాంబువు నధివసించు;
రహిహిమ వదనిల ప్రసారనిశలెల్ల :
భూతనాథు సంస్మరణలో మునిఁగిపోయి.

ఘోరంబైన తపంబుసేయఁడొడఁగెన్ క్షోణీధరాపత్యమున్,
క్రూరాభీలమృగప్రచార వనమందునే నిశ్చలప్రజ్ఞయై,
నీరాహారములం ద్యజించి, ఘనమానిశ్రేణులన్ మించి పెం
పారంగీర్తి గడించె శూలిపయిఁ బ్రేమన్ నించి, పెంపారఁగన్

# కంకణగృహీత శ్రీమతి కే. చంద్రమతి

## సంగ్రహ జీవితచరిత్ర

శ్రీ మాచిరాజు సీతాపతిరావు

స్త్రీలనుగూర్చి

"Patience ornaments the woman, and proves the man. It is loved in a boy, it is praised in a youth. In every stage it is beautiful." అను ఆంగ్ల సూక్తి గలదు.

**మఱియు :**

"మధుర హృదయము నన్నిట మంచితనము
ఓర్మి, మృదుభాషణంబును గూర్మిగల్గి
దుఃఖ సుఖముల నోరులకు దోడుపడుచు
నలరు కాంతను 'గృహలక్ష్మి' యండ్రుగదె!"

అను తెలుగు సూక్తియు గలదు.

ఏ దేశానికైనా ఆదేశపు స్త్రీలవలననే పరువు రాగలదు. స్త్రీలవలననే పరువు పోగలదు. కావున పరువు సంపాదించుకొనినవారే ఉత్తమ స్త్రీలు, వారే ధన్యులు. వారి జన్మమే జన్మము.

అది నవ్యాంధ్ర సారస్వతయుగ ప్రారంభసమయము. అంటే కీ|| శే|| కందుకూరి వీరేశలింగం పంతులుగారు తమ గ్రంథములు అచ్చువేయుటకై ముద్రణాలయం, స్వగృహం కొని మద్రాసు (వేపేరి) లో ఉండే రోజులవి. 1901 సం||రం ఆగష్టు 27వ తేదీని, "సీతమ్మకు కూతురు మా యింట్లోనే పుట్టినది. మా దంపతులం నామకరణం చేసినాము. ఆ రోజున చంద్రమతీ చరిత్రం వ్రాయుచుంటిని. కనుక ఆ బిడ్డకు 'చంద్రమతి' యని పేరు పెట్టినాము", అని తమ స్వీయచరిత్రలో శ్రీ వీరేశలింగం పంతులుగారు వ్రాసికొనియున్న దానినిబట్టి శ్రీమతి కానుకొల్లు చంద్రమతిగారు 27-8-1901వ తేదీని వేపేరిలో జన్మించినట్లు ధృవపడుచున్నది.

ఈమె తల్లిగారైన కోటికలపూడి సీతమ్మగారి వద్దనే బాల్యంలో స్త్రీలకు కావలసిన చక్కని విద్య గడించినది. తెలుగు, సంస్కృతములతో పాటు యింగ్లీషుకూడ కొంతవరకు నేర్చినది. కాకినాడ పి. ఆర్. కళాశాలలో ఇంగ్లీషు చదువ మొదలిడిన మొదటితరము ఆంధ్ర బాలికలలో యీమె మొదటి యామె. ఆనాటి P. R. College Souvenir లో యీమె ఫోటోగ్రాఫ్ ప్రచురించినారు కూడాను. ఈమె భర్త లేటు కానుకొల్లు మాధవరావు పంతులుగారు. ఈ శతాబ్దారంభములో పీఠికాపురోన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా ఉండేవారు. ఇటు పుట్టింటివారు కోటికలపూడి వారు, అటు మెట్టినింటివారు కానుకొల్లువారు. ఇరువంశములును ఆంధ్ర నియోగి బ్రాహ్మణులందు పేరుగాంచినవే. ఈమె 60వ యేట, కేసరి కుటీరంవారు యీమెను ఆహ్వానించి, ఏప్రిల్. 26వ తేదీని గృహలక్ష్మి సువర్ణ కంకణ ప్రదానం చేస్తున్నారని వినుట కెంతోయూ ఆనందమయిన సంగతి. ఈమెకు ఒక కుమారుడు, యిద్దరు కుమార్తెలు గలరు. అందరు వివాహితులే ఎవరి కాపురములు వారు సరిదిద్దుకొనుచున్నారు. మా మిత్రుడు చిరంజీవి శ్రీ K. Krisn a Moorty, B.E., Dy. Director, C. W. P. Commission, New Delhi గారే యీమె కుమారుడు. చంద్రమతి గారికీనడుమ కొంత జబ్బు కలిగినది. భగవదనుగ్రహమువలన మద్రాసులోని నిపుణవైద్య సహాయమును పొంది, యిపుడామె, హాయిగ, మద్రాసులో కాలము గడుపుచున్నవారు. శ్రీమతులు కనుపర్తి వరలక్ష్మమ్మగారు, కాంచనపల్లి కనకాంబగారు, చేబ్రోలు సరస్వతీదేవిగారు మొదలగు వారందరు యీవరకు గృహలక్ష్మి సువర్ణ కంకణము లందుకొనినవారే. ఇప్పుడు కానుకొల్లు చంద్రమతిగారు వీరి కోవకు జెందుచున్నారు. గృహలక్ష్మి మాసపత్రిక స్త్రీ లోకానికే కాదు, పురుష లోకానికి కూడా మేరలేని సేవ చేసినది, చేయుచున్నది, చేయగలదు. సువర్ణకంకణముల నందిన నారీమణులందరూ యీ పత్రికద్వారా దేశసేవ, భాషాసేవ, సంఘసేవ చేయుచున్నవారే. గృహలక్ష్మి పత్రిక పుట్టకముందే శ్రీ వీరేశలింగం పంతులుగారు స్త్రీ విద్యకై చేసిన పనిని అందుకొని నిర్వర్తించిన కొందరు స్త్రీలలో శ్రీమతి కోటికలపూడి సీతమ్మగారు ముఖ్యులు. ఈమె

"సాధురక్షణ శతకము" రచించెను. అంతేకాక "లేడీజేన్ గ్రే" అను ఆంగ్లకావ్యము ననుసరించి 1915 లో ఆంధ్రకావ్యమును, "అహల్యాబాయి", "ఉపన్యాసమాలిక", "ఉన్నత స్త్రీ విద్య", "కందుకూరి వీరేశలింగం చరిత్ర", "గీతాసారము" (పద్యములలో) మొదలగు నవీన గ్రంథములను రచించెను.

ఆంధ్ర కవయిత్రియు, పీఠికాపుర సంస్థాన విద్వాంసురాలును, గ్రంథకర్త్రియును, విదుషీమణియు, కీర్తిశేషురాలును యగు తల్లిగారైన సీతమ్మగారికి స్వీయరచనయైన "సరళా ప్రభాకరము" అను సాంఘిక నవలను అంకితమిస్తూ చంద్రమతిగారు ఆమెనుగూర్చి చెప్పినారు :—

"ధన్యజీవిని మృదుకవితా ధురీణ
పరమపూతయు, మాతృదేవతయు కీర్తి
శేషురాలునై, దివిజేరియున్న
తల్లి కొటికిలపూడి సీతమ్మ దలతు."

మఱియు :

ఆంధ్ర వనితలందు నాదర్శగృహిణి
ఆత్మ సంశుద్ధురాలు మహాత్మురాలు
పున్నెముల ప్రోవు, గాంభీర్యమునకు నెలవు
భక్తిపరురాలు వినయసంపన్నురాలు."

అనికూడా వ్రాసిరి.

శ్రీమతి సీతమ్మగారి కుమారుడును, చంద్రమతిగారి తమ్ముడును అయిన శ్రీ కొటికలపూడి రామేశ్వరరాయ కవి మా చిన్ననాటి సహాధ్యాయుడు. చాల కాలము పీఠికాపుర సంస్థాన ఉద్యోగిగా నుండినారు. ప్రకృతము తూర్పుగోదావరి జిల్లా పరిషత్తులో ఉన్నత పాఠశాలలో పాధ్యాయుడుగా నున్నారు.

ఈ మధ్యనే చంద్రమతిగారు "రాణీ చిన్నమ్మ కథ" (పిఠాపురం మహారాణీగారి చరిత్ర సంగ్రహం) చక్కని శైలిలో తెలుగు పాఠకులకొని కందిచ్చి, వారి కృతజ్ఞతకు పాత్రులైరి. ఇదియొక అపురూపమైన కార్యసాధన. సాధారణ రచయితకసాధ్యమైనది. మహారాణీవారికి గురువుగారును, కవయిత్రియునైన సీతమ్మగారి కూతురగుటవలన నీమెకీయుత్తమ కథావస్తువు లభ్యమయినది. మరెవ్వరికిని సాధ్యము కాదనుట అత్యుక్తి కానేరదు.

1949 సం॥రంలో చంద్రమతిగారు "సరళా ప్రభాకరము" అను "హిందూగృహము" (సాంఘిక నవల) రచించి ప్రకటించినారు. ఇందులో భారత నారి పాతివ్రత్యము వర్ణిస్తూ వ్రాసిన పద్మావతి కథ సొగసుగా యిమిడియున్నది. మొదటినుండియు గూడ హిందూ సంఘముయొక్క ఉత్కృష్టత, స్త్రీకి గల ఉన్నతస్థానము ఆదర్శవంతమైన గృహిణికి కావలసిన ఉత్తమగుణములు మొదలగు అంశములు వివరింపబడినవి. ఇందలి భాష సరళముగను యావదాంధ్రులకు గ్రాహ్యమగునట్లుగ నున్నది. హిందూ సాంప్రదాయాలు ఆచారాల ప్రత్యేకత పేర్కొనబడినవి.

చంద్రమతిదేవి చక్కని కవిత అల్లగలిగిన విదుషీమణి. ఈమె కృతులందు, అంకితపు పద్యాలెంతయు యింపుసొంపారుచున్నవి. ఈమె శ్రీ వీరేశలింగం పంతులుగారిని గూర్చి రచించిన పద్యములు మిక్కిలి హృదయంగమములు.

ఈమె రచించిన మంగళహారతులు ఆంధ్రలోకమున కెంతయో ఉపయోగకరముగా నుండును. భక్తిదాయకమైనట్టి, హృదయంగమమైనట్టి యీమె రచనలు యీమెయే పాడునప్పుడు ఎంతో విన ముచ్చటగానుండి, సనాతనాధునాతనాంధ్ర భావముల మేలుకలయికలో రసము లొలుకుచుండును. ఈమె కొంతకాలము, అఖిలభారత రేడియో కార్యక్రమాలలో పాల్గొనెడివారు.

ఈ సంవత్సరం గృహలక్ష్మి సువర్ణకంకణ ప్రదానోత్సవము ఉభయతారకముగా ప్రసిద్ధి వడయగలదు. కంకణప్రదానం చేయుచున్న సంస్థ "కేసరి కుటీరం" వారు ధన్యులు. సువర్ణ కంకణము బడయు నర్హత గలిగించుకొనిన శ్రీమతి చంద్రమతి కవయిత్రిగారు ధన్యులు. పరమ పితయగు చంద్రశేఖరుడీమె కాయురారోగ్యైశ్వర్య భాగ్యముల నొసంగుగాత !"

ఈ సందర్భములో :

"తండ్రివంశంబు నందేడు తరములకును
తల్లివంశంబు నందేడు తరములకును
ధవుని వంశంబు నందేడు తరములకును
శాశ్వత స్వర్గసౌఖ్య మీజాలు సాధ్వి"

అని శ్రీనాథ కవిసార్వభౌముని మాటల నుటంకించి యీ వ్యాసమును ముగిస్తాను.

సర్వేజనాస్సుఖినోభవంతు !!

# గృహలక్ష్మి

## స్వర్ణ కంకణ స్వీకారము

### కృతజ్ఞత

శారదాదేవి కరుణఁ బ్రశస్తిగన్న
విదుషులకర పల్లవముల వెలయు స్వర్ణ
కంకణమ్ము బహూకృతిగాఁగఁ బడసి
దాని దాల్చు భాగ్యమ్మున ధన్యనైతి॥

భవ్య కేసరి మింట శుభంబులొసఁగ
కంకణంబును దాల్చినే కరము మోడ్చి
భక్తి నంజలి ఘటియించి ప్రణతులిడుదు
పుణ్య పూరుషుస్మరియింతు ముదము మీఱ॥

నతులొనర్తు సోదరీ ప్రతితకెపుడు
వందన సహస్రమర్పింతు నాప్తసఖులకును
కంకణ ప్రదానమొసంగి గౌరవించు
సభ్యకోటికిడుదును నమస్కారశతము॥

కానుకొల్లు చంద్రమతి

# కిటికీలోని కోమలి

శ్రీ వి. విశ్వనాథం



ఇల్లుకట్టి చూడు, పెండ్లిచేసి చూడు, అన్నట్లే 'కలకత్తాలో కాపరానికి కొంపచూడు' అనతగ్గది. ఈమూడు చేయకలిగినవాడు మహాఘనుడనే చెప్పాలి. ఇందులో ఏ ఒక్కటి చేయకలిగినా సమర్ధుడనే అనిపించుకుంటాడు. అంటే ఇల్లు కట్టడానికి తగిన ఆర్థిక స్థిమితము, ఓర్పు, పెండ్లిచేయడానికి యీడుజోడు అయిన సంబంధము, కట్నకానుకలు వగైరాలకు వలసిన ఆర్థికస్తోమతు, కలకత్తాలో యిల్లు చూసుకోడానికి ఓర్పులోపం కారణంగా నుంటుంటవి. మాధవయ్య కనిపెంచిన తల్లిదండ్రులను దూరప్రాంతంలో వదలి గత్యంతరములేక ఉద్యోగాన్వేషణకని కలకత్తాకు చేరాడు. ఉద్యోగమయితే త్వరగానే దొరకింది కాని ఉండటానికి కొంపకు మాత్రం విశ్వప్రయత్నంతో కూడిన శ్రమపడవలసి వచ్చింది.

ఇల్లు అంటే - ఊరినుండి రాబోయే యిల్లాలికి నచ్చాలి. పిల్లల చదువుకి పాఠశాల దగ్గరగా నుండాలి. కూరగాయల మార్కెట్, పచారీ సామానుల కొట్టు సమీపంలోనుండి తమ యిల్లుండే వీధి విద్యుద్దీపాలతో కళ, కాంతులు కలిగియుండాలి. ఇలాంటి గొంతెమ్మ కోరికలు అందరికీ సహజం. వెదకి, వేసారితే చివరకు ఒక యింటిని సంపాదించాడు మాధవయ్య, వంద రూపాయలు అద్దె అయినా విశాలమైన గదులు, అందులోని కిటికీలు, సూర్యరశ్మి, గాలికి లోటులేకుండా యిల్లు వసతిగా అమరింది.

"కిటికీ చూడు
కిటికీలోని కోమలిని చూడు
కల్యాణం కావాలని
కోరి దీవించు !"

అని కోతుల నాడించువాడు పాడుతున్నాడు బయట యింటిముందు. పిన్నలు, పెద్దలు కోతుల ఆట చూస్తున్నారు. కోతులు ఆడించేవాడు చెప్పినట్లల్లా ఎగురుతున్నవి, దూకుతున్నవి, కూర్చుంటున్నవి, పరుగెత్తుతున్నవి, దాటుతున్నవి. 'అభ్యాసము కూసువిద్య' కాబట్టి నోరులేని జీవుల విషయంలోకూడ అది నిజమే కదా! ఆ కోతుల నాడించినవాడు దానివల్ల పొట్టపోసుకుంటాడు - యిప్పుడు, యికముందు కూడా.

మాధవయ్యగారి యింటిగది కిటికీకి అది ఎదుర కిటికీ. అందులోని కోమలి అప్సరసను మరిపించే సౌందర్యరాసి. కోతులవాడి రాకమూలంగా అదే మొదటిసారి మాధవయ్య ఆమెను చూడటం. అలా ఆమెను చూస్తూ ముగ్ధుడై కిటికీచువ్వలు పట్టుకొని ఎంతకాలం నిలబడ్డాడో చెప్పలేం.

కోతులాట అయిపోయినా ఆ యువతి తదేక ధ్యానంతో తన్నే చూడడమెందుకు? వంపుసొంపులు గలవయ్యారి - పెండ్లయిందో లేదో పాపం! నవ నాగరికపు పోకడలన్నీ యున్నవి. ఆమెతో ఒక్కసారి మనసార మాట్లాడాలనిపించింది. కాని ఏమంటుందో – చీవాట్లు చీదరింపుయి అమరవు కదా! ఆడవాళ్లను నమ్మలేం. అవునన్నది కాదనవచ్చు. కాదన్నది అవుననవచ్చు. ఆడవారి పోకడలకు అర్థాలే యుండవు ... యిలాటి యూహాలు శరపరంపరలుగా దొర్లిపోతున్న సందట్లో గడియారం గంట ఠంగ్ ఠంగ్ మని మ్రోగింది. ఉలిక్కిపడి ఆఫీసుకు టైమయిందని గబగబ ముస్తాబై బయలుదేరాడు. కాని కాళ్లు ముందుకు నడిస్తేగా! మరల యింకొకసారి కిటికీ దగ్గరకుపోయి చూచాడు కాని ఆ యువతి లేదు. ఇక ఆవేళ ఆఫీసుకు సెలవు చీటీవ్రాసి పంపించి గదిలోకిపోయి కుర్చీలో చేరగిలబడ్డాడు. సిగరెట్ వెంబడి సిగరెట్ తగలబడి పోతున్నది. ఆలోచనా సముద్రంలో దరి డొంక తెలియక కొట్టుకలాడేవారికి సిగరెట్లు ఎంతగానో తోడ్పడతవి.

అంతవరకు మాధవయ్య తన వివాహమును గురించికాని, కానున్న జీవితభాగస్వామిని గురించి కాని ఆలోచించి ఎరుగడు. కాని 'కిటికీలోని కోమలి' మాత్రం అతనిలో విప్లవం తెచ్చింది. ఆమె తనభార్య అయితే అదృష్టవంతుడనని యువ్విళ్లూరాడు.

సాయంకాలం 3 గంటలకు మరల ఆ యువతి కిటికీలో ప్రత్యక్షమయింది – తనవైపే చూస్తున్నది. నవ్వుతున్న ఆమె పెదవుల మధ్యనుండి తొంగి చూస్తున్న పలువరుస వేయివరహాలు విలువ కలదనిపించింది. 'నవ్వు నాలుగువిధాల చేటు' అని అనడం అలనాటయినా ఆమె నవ్వే వేరనిపించింది. ఆమె

నవ్వుతున్నప్పుడు బుగ్గలపై ఏర్పడే సొట్టలు ఆమె సౌందర్యాన్ని యినుమడింపచేసినవి. మాధవయ్య కూడ ప్రత్యుత్తరంగా ఒక చిరునవ్వు విసిరేశాడు.

ఆ రాత్రంతా మాధవయ్యకు మధురస్వప్నాలు — ఆ యువతి తన్ను ప్రేమించినట్లు, యిద్దరూ కలిసి కులాసాగా షికారు వెళ్లినట్లు, తన్నుతప్ప మరొకరిని వివాహమాడనని తన చేతులు పట్టుకొని బాసచేసినట్లు...యింకా...యింకా...

మరునాడు ఉదయం లేచాడుకాని పని ఏమి తోచలేదు. కాలకృత్యాలు తీర్చుకొని కాఫీత్రాగి వద్దామని హోటలుకు బయలుదేరి వెళ్లాడు. వర్షపు తుప్పరలు పడుతున్నా తిరిగి వస్తూయున్నంతసేపూ ఆ కోమలితో ఎలాగ పరిచయం చేసికోడమా యనేదే ఆలోచన. ఒకజాబు వ్రాసి కిటికీలోనుండి పడేస్తేనో! - లేక మధ్యవర్తిత్వానికి ఎవరైనా...అదేది నచ్చలేదు. ఇలాంటి ఆలోచనల పరంపరలతో తీరా వాళ్ల యింటి గుమ్మం దగ్గరకు వచ్చాడు. కాళ్లు వాటంతటవి గడపలెక్కి హాలులో కుర్చీలో కూర్చొని యున్న ముసలాయన దగ్గరకు వెళ్లినాయి. ఆయనను "తాయారురావుగారుండేది యిల్లు యిదేనాండీ!" అని అడిగాడు.

ఆ ముసలాయన కాదన్నట్లు తలయూపి తాయారురావు ఎవరా! అన్నట్లు మాధవయ్య వంక చూచాడు.

"తాయారురావుగారు స్కూల్సు యిన్స్పెక్టరు. ఈ వీధిలోనే యున్నారని ఎవరో చెప్పారు. ఇంటి నెంబరు మాత్రం తెలియదు. మీకు శ్రమ కలిగించినందుకు క్షమించాలి! శలవు" అని వెనక్కు తిరిగాడే కాని మాధవయ్యకు కదలాలనియుంటేగా!

మరల మాధవయ్య "ఆయనతో అర్జంటు పని యున్నదండీ! మధ్యన యీ వర్షమొకటి చీకాకు పరుస్తున్నది" అంటూ చేతిరుమాలుతో ముఖం, ముంజేతులు తుడుచుకోసాగాడు.

"దానికేంలే — వాన వెలసిన తరువాతే వెళ్ల వచ్చు. రా అబ్బాయ్! వచ్చి కుర్చీలో కూర్చో" అన్నాడు ముసలాయన.

మాధవయ్య కుర్చీలో కూర్చున్నాడేకాని 'కిటికీలోని కోమలాంగి' కనుపిస్తుందేమోనని అటూయిటూ చూడసాగాడు. ఇల్లు శుభ్రంగా, అందంగా అలంకరించబడియున్నది. హాలులో ఒకప్రక్కన టేబిలు, దానిపై రంగురంగుల కాగితపు పూవులు, కుర్చీలు, సోఫాలు ముచ్చటగా నున్నవి. ఇంట్లో ఎవరూ లేరాయన్నట్లు నిర్మానుష్యంగా నున్నది. నిశ్శబ్దాన్ని బ్రద్దలు చేస్తూ ముసలాయన సంభాషణ మొదలు పెట్టారు.

"మీది ఏయూరు? యిక్కడ ఏం చేస్తున్నావు బాబూ?"

"మాది మదనాపుర అగ్రహారం. చదువయ్యాక యిక్కడికి ఉద్యోగానికని వచ్చి సిగరెట్ల కంపెనీలో గుమాస్తాగిరి చేస్తున్నాను. నా పేరు మాధవయ్య"

కొంచము సేపటికి వానదేవునికి వాయుదేవుడు తోడై కిటికీలలోనుండి జల్లుకొట్ట సాగింది. వాని తలుపులు వేయడానికి ముసలాయన లేవబోతుంటే మాధవయ్య వారించి తనే స్వయంగా లేచి కిటికీలు మూసాడు. కాని కోమలి కనుపించలేదనే నిస్పృహ మాత్రం అనుక్షణం ప్రబలిపోతున్నది.

"ఏం వానలు బాబూ! ప్రాణాలు తీసేటట్లున్నవి" అన్నాడు ముసలాయన చీకాకుతో

మాధవయ్య "అదేమిటండీ అలాగంటారు! ఏ కాలానికది యుండాలిగా! శీతాకాలంలో చలి లేకపోతే విడ్డూరపడతాం; చలి ఎక్కువగానుంటే యింత చలి ఎప్పుడూ లేదంటారు. ఏటేటా యిదే వరుస" అన్నాడు.

కళ్లజోడు సవరించుకుంటూ ముసలాయన "అబ్బాయ్! పెళ్ళయిందా నీకు" అని అడిగాడు చిరునవ్వుతో.

ప్రథమ పరిచయంలో సాధారణంగా ఎవరైనా అడిగే ప్రశ్న లేనని మాధవయ్యకు తెలిసినా తన ఉబలాటాన్ని పురస్కరించుకొని "యింకా లేదండీ! ఇప్పట్లో పెళ్లిచేసికోవాలనే యుద్దేశంకూడ లేదు. పెళ్ళిచేసుకొని అనేకమంది పడుతున్న యాతనలను చూస్తున్నాంగా! పావలా సంపాదించలేని పాపారావు పెళ్ళిచేసుకొని కుటుంబ పోషణకని పడుతున్న శ్రమం, చేస్తున్న పాడుపనులు అనేకం. గుంపెడు సంతానం, భార్య, వృద్ధాప్యంలో — ఆయన సుఖపడడానికా లేక తనమీద ఆధారపడినవారిని సుఖపెట్టడానికా యీ పెండ్లి చెప్పండి?" అని దినితో బాటు మరి పది నిదర్శనాలు చూపిస్తూ పెండ్లిపట్ల తన అయిష్టతను తెలియబుచ్చాడు.

"అలా కాదబ్బాయ్ ? మానవ జీవితయాత్రలో ఒడిదుడుకులున్నా స్త్రీపురుషులకు పరస్పరసహకారం, సహాయాలు అత్యావసరం. వానికి మూలాధారం ప్రేమానురాగాలు. వానిని పురస్కరించుకొని వివాహ సంబంధం. లోకంలో జరిగే పెళ్ళిళ్ళన్నీ ఒక తీరు పరిణామాలకు దారితీయవు. ఇదుగో చూడు — మా ఆవిడ ఉన్న మొన్న మొన్నటిదాక మా సుఖ సౌభాగ్యాలు ఎంతో చక్కగా నుండేవి. మా అన్యోన్యానురాగాలనుచూచి భగవంతుడు సయితము అసూయపడ్డాడేమో ! — ఆ యిల్లాలిని అలా తీసికొని పోయాడు." అన్నాడు కండ్లనుండి బొట బొట నీరు కారుస్తూ. వాన వెలసింది. వెళ్ళడానికి శలవు తీసికొని కుర్చీనుండి లేచాడు మాధవయ్య.

"మీరిక్కడేయున్నారు కాబట్టి అప్పుడప్పుడు వస్తూయుండబ్బాయ్ !" అన్నాడు ముసలాయన సాగనంపుతూ.

లాగు మీదకు రెండు మడతలు పెట్టి మాధవయ్య ఎత్తెత్తి అడుగులు వేస్తూ రోడ్డుమీద నడుస్తున్నాడు. వెనుకనుండి "మాధవయ్యా! ఎక్కడికి బయలుదేరావు ?" నారాయణరావు కేక వేశాడు.

మాధవయ్య ఆగక తప్పిందికాదు.

"ఏమిటి నిశేషాలు ? — తాతగారి యింట్లోనుండి వస్తున్నట్లున్నది !" అన్నాడు నారాయణరావు దగ్గరకువచ్చి.

"ఏమిలేదోయ్! బయలు దేరుదామని వీధిలోకివచ్చే సరికి వర్షం వచ్చింది. తడిసిపోకుండా వాళ్ళ యింట్లో ఎవరిని తెలియకపోయినా తాతగారి యింట్లో ప్రవేశింపక తప్పిందికాదు" అన్నాడు మాధవయ్య.

"బలేబాగుంది ? తాతగార్నే తెలియదానీకు ?" అన్నాడు నారాయణరావు మాధవయ్యతో ఆ నవ్వని రేకెత్తిస్తూ.

నారాయణరావు మరల "ఆయన ఒక రిటైర్డు గెజెటెడు ఆఫీసరు. రెండవ భార్యకు రంభలాంటి కుమార్తెయుంది. ఆమెను కని తల్లి చనిపోయింది. అది ఆయనకు తీరనిలోటు. కుమార్తెనుమాత్రం శ్రమ అనుకోకుండా అల్లారు ముద్దుగా పెంచాడు. అయితే !..." అన్నాడుం ముక్కు ఎగ బీలుస్తూ.

"రంభవంటి కూతురంటూ నీ వెందుకు దుగ్ధపడుతున్నావు" అన్నాడు మాధవయ్య.

"ఏమి చెప్పమన్నావు మాధవా ? ఆమెకు పెళ్ళిచేసి, ఆస్థిపాస్తులు అప్పగించి తను పరలోకానికి పోవాలని ఆ ముసలాయన ఆరాటం."

"అయితే !"

"అయితేలేదు, గియితేలేదు. పిల్ల అందచందాలను ఆస్థిపాస్తులనుచూచి అనేకమంది యువకులు ఉబలాటపడుతూ వచ్చి చూచేవారేకాని తీరా మూగదని తెలియంగానే వెనక్కుతిరిగి చూడకుండా వెళ్లిపోయారు. మరి నీవు ..." అన్నాడు నారాయణరావు.

మాధవయ్య ముఖం వెల వెలబోయింది. భగవంతుడికింత నిర్దయా అనుకున్నాడు లోలోపల.

---




పూర్ణా పిక్చర్స్ ప్రైవేట్ లిమిటెడ్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ జి. కామరాజు గారి జపాను పర్యటనను పురస్కరించుకొని ఫ్లడ్ లైట్ అడ్వర్టైజింగ్ & పబ్లిసిటీ సర్వీస్ భాగస్వామి శ్రీ పి. వి సుబ్బారాయుడు ఏప్రెల్ 29 వ తేది సాయంకాలము న్యూవుడ్ లాండ్స్‌లో అల్పాహార విందు ఏర్పాటు చేశారు. అనేకమంది పత్రికా రచయితలు సినీ పరిశ్రమకు సంబంధించిన పెద్దలు హాజరయ్యారు.



బి. ఏ. యస్. వారి 'రాణీరత్నప్రభ'లో రేలంగి, సురభి బాలసరస్వతి ప్రణయ సన్నివేశం

శ్రీ సుబ్బారాయుడు స్వాగతము చెప్పుచూ శ్రీ కామరాజు జపాను పర్యటనానుభవాలు చిత్ర పరిశ్రమాభివృద్ధికి తోడ్పడగలవని ఆశిస్తున్నాననియు, ఈ సందర్భమును వినియోగించుకొని వారికి విందు ఏర్పాటుచేయడం తనకు చాల సంతోషకరమనియు అన్నారు.

శ్రీ కామరాజు మాట్లాడుచూ జపానులో తన పర్యటన కాలము కొద్దియే కాబట్టి తాను గ్రహించ కలిగింది విశేషమనిపించుకోదనియు, జపానులో చిత్ర నిర్మాణం, ప్రదర్శనము సుగమంగా నుండటానికి చిత్రాల పొడుగు తక్కువ, ఉత్పత్తి ఖర్చులు తక్కువ కారణమనియు, చిత్రముల పొడుగు తక్కువగుటచే ఒకే ప్రదర్శనంలో ఒక చిత్రము, సంగీత, నృత్యముల లాంటి కార్యక్రమములుండటం సహజమనియు, చిత్ర పరిశ్రమావసరాలన్నిటిని జపాను స్వయంగానే లఘు పరిశ్రమల ద్వారా తయారుచేసికుంటుందని, ప్రజలలో నైతిక స్థాయి, చిత్తశుద్ధి ఉన్నతమయింది కాబట్టి పరిశ్రమాభివృద్ధికి పరపతి సౌకర్యాలున్నవనియు, కళాకేంద్రాలు, శిక్షణాకేంద్రాలు ఉత్తమ నటీనటులను, సాంకేతిక నిపుణులను తయారుచేయుననియు, ఉన్న అవకాశాలను సద్వినియోగం చేసికొని, కృషిచేసి తమ పురోభివృద్ధిని రూపొందించుకోడానికి వారి దేశ విశేషజనాభాయనియు వివరించిరి.

కొందరు పత్రికా రచయితల ప్రశ్నలకు సమాధానములు చెప్పినతర్వాత శ్రీ సుబ్బారాయుడు వందన సమర్పణము చేశారు.

◆ ◆ ◆

నవశక్తి ఫిలిమ్స్ వారి 'మా యింటి మహాలక్ష్మి' చిత్రము యీ సంవత్సరపు ఉత్తమ చిత్రాలలో ద్వితీయ స్థానమును గడించి ప్రెసిడెంటు అవార్డు ప్రకటించబడింది. ఫిలిం ఫాన్స్ అసోసియేషన్ వారుకూడ యీ ఏటికిది ఉత్తమ చిత్రంగా నిర్ధారణ చేసిన విషయము గమనించతగినది.

ఈ చిత్రంలో ప్రముఖ పాత్రల నిర్వహించిన జమునా, జగ్గయ్య, దర్శకుడు శ్రీ జి. రామనీడు బహుమతుల ప్రదానోత్సవంలో పాల్గొనడానికి వెళ్లారు.

నవశక్తి ఫిలిమ్స్ వారు మరాటీ మూలము ననుసరించిన కథను వస్తువుగా తీసికొని సాంఘిక చిత్రాన్ని నిర్మించడానికి ఏర్పాట్లు చేశారు.

ఇందులో నాగేశ్వరరావు, కృష్ణకుమారి, గుమ్మడి, రమణారెడ్డి మున్నగువారు నటిస్తున్నారు. శ్రీ జి. రామనీడు గారి దర్శకత్వం.

♦ ♦ ♦

జెమినీ పిక్చర్స్ వారి 'పైగాం' (సందేశము) యావదాంధ్ర దేశంలో ప్రదర్శింపబడుతూంది.

♦ ♦ ♦

బి. ఏ. యస్. ప్రొడక్షన్స్ వారి 'రాణీ రత్నప్రభ' చిత్రంకూడ ఈ నెల 27 వ తేదీన విడుదల కాగలదు. ఇందులో రామారావు, అంజలిదేవి ప్రధాన పాత్రలు నిర్వహిస్తున్నారు.

♦ ♦ ♦

కృష్ణ చిత్ర వారు నిర్మిస్తున్న 'బావ మరదళ్లు' చిత్రంలో రమణమూర్తి, సి. యస్. ఆర్., సూర్యకాంతం, వంగర, చదలవాడ, కృష్ణకుమారి, మాలిని మున్నగువారు నటిస్తున్నారు. కథ, నిర్మాత, దర్శకుడు శ్రీ పద్మనాభరావు. శ్రీ ఆరుద్ర, శ్రీ శ్రీ గారలు సంభాషణలు. పాటలు కూరుస్తున్నారు సంగీతము పెండ్యాల వారిది. ఈ చిత్రం జూన్‌లో విడుదల కాగలదని వార్త.

♦ ♦ ♦

'భక్త శబరి' చిత్రాన్ని సుఖీభవ ప్రొడక్షన్స్ వారు తెలుగు, తమిళ భాషలలో నిర్మిస్తున్నారు. నిర్మాత శ్రీ బి. ఆర్. నాయుడు, శ్రీ చిత్రపు నారాయణమూర్తి దర్శకత్వము. ఇందులో హరనాథ్, పండరీబాయి, మీనాకుమారి, శోభన్‌బాబు, రాజశ్రీ మున్నగువారు నటిస్తున్నారు. చిత్ర నిర్మాణము యించుమించుగా పూర్తయినట్లే. సంభాషణలను శ్రీ పాలగుమ్మి పద్మరాజు, సంగీతమును పెండ్యాలవారు నిర్వహిస్తున్నారు. జూన్ నెలలో నీ చిత్రముకూడ విడుదలకావచ్చు.

♦ ♦ ♦

జగపతి పిక్చర్స్ వారి 'అన్నపూర్ణ' విడుదలకు సిద్ధముగానున్నది. ప్రముఖ నటీనటులతో శ్రీ వి. మధుసూధనరావు దర్శకత్వము క్రింద నిర్మాణమైన మహత్తర సాంఘిక చిత్రము. ఇందులో నాయకీ నాయకులు జమున, జగ్గయ్య. హాస్యనటుల జంట రేలంగి రమణారెడ్డి నటిస్తున్నారు. ఇంకా గుమ్మడి, సి. యస్. ఆర్., శివరామకృష్ణయ్య, గిరిజ, ఛాయాదేవి నటిస్తున్నారు. నిర్మాతలు శ్రీ పి. రంగారావు, బాబూ రాజేంద్రప్రసాద్ గారలు, కుటుంబ మెత్తము చూడవలసిన చిత్రంగా రూపొందించారు.

♦ ♦ ♦

శ్రీ విఠలాచార్య డైరక్టుచేసిన 'అన్నా చెల్లెలు' చిత్రమూ విడుదలకు సిద్ధముగానున్నది. ఇందులో రాజనాల, రామమూర్తి, రమణాచలం, దేవిక, మిక్కిలినేని, మీనాకుమారి, సుశీల నటిస్తున్నారు.

♦ ♦ ♦



సుఖీభవవారి 'భక్త శబరి' చిత్రంలో కు॥ శ్రీ॥ ఆర్. నాగేశ్వరరావు, లక్ష్మీకిరణం నటించిన సన్నివేశము

మంజీర ఫిలిమ్స్ వారు ఏప్రెల్ 11 వ తేదిన వీనస్ స్టూడియోస్‌లో తమ క్రొత్త చిత్ర నిర్మాణమునకు ప్రారంభోత్సవము జరిపారు. ఈ సందర్భమున చలన చిత్ర పరిశ్రమకు సంబంధించిన ప్రముఖులు వచ్చి నిర్మాతల ప్రయత్నము, కృషి సఫలమగునట్లు శుభాకాంక్షలను తెలిపారు.

సుప్రసిద్ధ నిర్మాత, డైరక్టరు శ్రీ కే. వి. రెడ్డి

(236 వ–పేజి చూడుడు)






## టమాటో తొక్కు

(సీమవంగ) 7 వీశల టమాటో పండ్లు, 5 పలములు చింతపండు, మిరపపొడి 2 అౌన్సులు, వుప్పు $1\frac{1}{2}$ అౌన్సు, ఇంగువ $\frac{1}{4}$ పలం, ఆవాలు చారెడు, మెంతులు కొంచెం నూనె 10 పలములు, బెల్లం 2 పలములు తీసివుంచుకొనుము. మెంతులు, ఆవాలు, ఇంగువ బాణాలిలో వేయించి పొడిచేసి వుంచుకొనుము. తర్వాత చింతపండు నాననిచ్చి గుజ్జుతీసి వుంచుకొనుము. ఆ వెనక బాణలిలో నూనెపోసి పలం ఆవాలు వేసి చిటపట అనగానె వుంచుకొన్న టమాటోలను వేయవలెను. కొంత వాడనిచ్చి మిరపపొడి వగైరాలను వేసి, వుప్పు పసుపుపొడి వేసి బాగా కలయబెట్టి చింత గుజ్జు వేసి సన్నిటి సెగలో వుడకనీయవలెను. కళాయి గరటతో కలుపుతూవుండవలెను. లేకున్న అడుగు అంటిపోవును. బాగా వుడికి నీళ్లుఇగిరిన తర్వాత తాకి చూచిన చేతికి అంటకుండవలెను. అట్లయినపుడు దించి ఆరనిచ్చి జాడీలో వుంచుకొనుము. ఇది రుచికరముగావుండును. చాలా రోజులు నిల్వవుండును. రొట్టెలు మొదలైన వానికి నంజుడుగా వుపయోగించవచ్చును.

## వెలగపండు పానకము

మాగిన వెలగపండ్లు 4 తీసుకొని పై పెంకులనుతీసేసి లోనవుండు మెత్తనిగుజ్జును కళాయి పాత్ర యందు వేసి నీళ్ళుపోసి బాగా పిసికి గింజలను తీసేసి తెల్లని, చలవవస్త్రము లేక కూరవడబోయు పాత్ర యందుగాని వడపోయవలెను. సుమారు ఒక పడినీళ్లు వుండవచ్చును. అందులో $\frac{1}{2}$ వీశ బెల్లము మెత్తగా పొడిచేసి వేయుము. కాస్తకుంకుమ పువ్వు, చంచాడు ఏలకుపొడి వేసి బాగాకలిపి వుపయోగింపుము. వలయు వారు ఐస్ చేర్చుకొనవచ్చును. ఎండ వేడిమికి చక్కని పానీయము.

## గసగసాల పానకము

సుమారు ఒక అౌన్సు గసగసాలతో 4 అౌన్సుల పాలు తీసుకొనవచ్చును. ఒక అౌన్సు గసగసాలు $\frac{1}{2}$ గంట నీటియందు నాననిచ్చి, నీళ్లువల్లి రుబ్బి పాలుతీసుకొనవలయును. మళ్ళా పిప్పిని కొంటవేసి రుబ్బి పాలు తీసుకొనవలయును. అటుల 3-4-మారులు పాలుతీసుకొని శుభ్రమైన సన్నని వస్త్రములో వడియగట్టి 10 పలములు బెల్లము లేక పంచదార, ఒక నిమ్మపండురసము, కాస్తఏలకుపొడి, కాస్తఐస్, వేసి కలిపి ఉపయోగింపుము

## పనసపండు జామ్

సుమారు 30 పనసతొనలు, 10 పలములు బెల్లము, నెయ్యి 2 పలములు, తీసివుంచుకొనుము. పనసతొనలు బాగుగావుడకబెట్టి దించి మెత్తగా కవ్వముతో ఎనపవలయును తర్వాత కళాయిపాత్రలో బెల్లము వేసి $\frac{1}{2}$ అౌన్సు నీళ్ళుపోసి కరిగినతర్వాత ఎనిపిన పనసపండును వేసి కలియవుడికించి, కాస్తఏలకు పొడి, కాస్త పచ్చకర్పూరమ్, కాస్త కుంకుమపువ్వు, వుంచుకొన్న నెయ్యివేసి బాగుగాకలపి శుభ్రమైన సీసాలోగాని జాడీలోగాని వేసి వుంచుకొనుము. ఇదిచాలరోజులు నిలవవుండును. అవసరాలకు పండుగ పబ్బములలో వుపయోగించవచ్చును. ఇదేమాదిరి టమాటపండ్లు, మామిడిపండ్లు, పైనాపిల్ (అనాస) పండ్లుతోనూ చేసుకొనవచ్చును.

M. R. సీతమ్మ

# ఆత్మనివేదనము

సాహిత్యసరస్వతి శ్రీ సీరిపి ఆంజనేయులు

(గత సంచిక తరువాయి)

ఈ రీతి ముసలమ్మ గృహకార్యములను
బాలముల పనులను బూర్తిగావించి,
యనుదినంబునను సాయంవేళలందు
ననుఁగుబాలలఁ గూడి యాడెడునపుడు
గుడులు గట్టించు; నా కోవెలలందు
దేవతాప్రతిమలఁ దీర్చు; సద్భక్తి
బోనముల్ వెట్టును; పూజలు సల్పు;
సూరిదేవరల గంగోత్సవవిధుల
నడపెడి పోలికఁ గడఁగుచునుండు,

రాత్రులు వీధిపురాణముల్, కథలు,
భక్తుల చరితముల్, భామినీమణుల
యితివృత్తములు, భారతేతిహాసములు,
నాత్మరంజకములౌ హరిహరగాథ
లాలించి సంప్రీతి, నందందుఁ బొలుచుఁ
గరుణరసముపట్లఁ గన్నీరుగార్చు.

ఆచాన కేప్రొద్దు నానందమిడెడు
రమ్యవస్తువులలో రాట్న మొక్కండు;
పనిలేనివేళలఁ బ్రతినిమేషమ్ముఁ
జేదోడు వాదోడు సిరిదోడు నగుచు
రాట్నమ్ము సఖివోలె రంజించుఁ దన్ను.

తన కులమునఁ బెండ్లితంతు సాగించు
వలనున నొదవఁ బావనకార్యతతికి
నుపకరణముగ నూటొక్క నూల్పోఁగు,
కన్నెలు వడుకుటే కర్జమైయుంట,
నేయింటఁ గల్యాణ మెప్పుడేర్పడిన
నప్పుడ ముసలమ్మ యచ్చోట నిల్చు,
రమణీయగతిఁ దన రాట్నమ్ముతోడ.
పరమవదాన్య స్వభావయౌ కతనఁ
దన మనోవృత్తికిఁ దగినమందిరమె
మయ్యెఁ; బుట్టినయింటి మెలపున నందు
ననయంబుఁ గలకలలాడు నెమ్మోము
చిఱునవ్వు వెన్నెలల్ చిందుచునుండఁ
చిన్నపెద్దలలో నభేదభావమున
మలసె; వారలనెల్ల నలరించెనువిద.

"అత్తమాటల కెదురాడని ముగుద
కోడలుగా దది కూరిమి బిడ్డ
తల్లికూఁతులకు భేదము కల్గుఁగాని
మనె నత్తలోఁ బొత్తుగని ముసలమ్మ"
యని జనమ్ములు మెచ్చ నామె వర్తించె.
కోమలి కడగొట్టు కోడలౌ కతన,
వయసునఁ దక్కిన వనితలయందు
మిగులఁ జిన్నదియౌట, మేలిగోనాల
మృదు వగు నడవడి మేటియైయుంట,
మాటమర్యాదల మందలింపులను
మాయమర్మంబులు ముందునకైన
నెఱుఁగనిదగుట, నా యెలనాగ మిన్న
మాతులుకడఁ జాల మన్నన వడసె.

మామను బితృగతి మన్నించి కొలిచి,
బావలపై భ్రాతృభావమ్ము నెఱపి,
ధవుఁ బరంధాముచందమునఁ బూజించి,
పౌరులయెడ బాంధవప్రీతి నించి,
తోడికోడండ్ర పొత్తును వీడకుండి,
సకియులఁ దనప్రాణసములుగాఁ జూచి,
పూసలలోపలఁ బూవులలోన
దారమ్ముపోల్కిఁ జిత్తమ్ము హత్తించె
నెల్లర యెడఁదల నేకమౌపగిది.

(సశేషము)

# తగాదా తీర్చిన ఉగాది

శ్రీమతి ద్విభాష్యం కామేశ్వరి

ఉగాది పండుగవచ్చిందంటే ప్రతియింట నవచైతన్యము, కళాకాంతులు సౌభాగ్యచిహ్నంగా రాణిస్తున్నవి. ఉదయం తలగడుగులు కాగానే పిన్నలు, పెద్దలు వేపపువ్వుపచ్చడి కొరకు ఎదురు చూస్తున్నారు. సూర్యభగవానుడు తన సహజ కాంతులతో తూర్పుదిశనుండి బయలుదేరాడు. క్రమంగా సూర్యరశ్మి నలుదెసల ద్విగుణీకృతంగా వ్యాపిస్తున్నది. ఒకగుమ్మంలో మాత్రం ఒకయువతి ఎవరికోరకో ఎదురు చూస్తూ నిలబడియున్నది. ఆమె ముఖంలో ఆశ, నిరాశలండు సమ్మిళితమైయున్నవి. అంతేకాదు భయాందోళనలు సయితము పొడసూపుచున్నవి. తలారస్నానముచేసి యుండటంచేత చిందర బందరగానున్న వెంట్రుకలు గాలికి ఎగురుతున్నవి. ఇంతలో పదేళకుర్రవాడువచ్చి "అక్కయ్యా! బావ యింకారాలేదే! బండివచ్చే వేళ కూడ మించి పోయింది" అన్నాడు.

"తప్పకుండా వస్తానని వ్రాశాడు. బండిరావడం ఆలస్యమయియుంటుంది, లేదా తప్పైనాపోయి యుంటుంది." అన్నది పద్మ.

గుమ్మంలోనుండి వెళ్లిపోయి గదిలో కిటికీ ప్రక్కనున్న వాలు కుర్చీలోకూలబడింది. ఆమె బురలోని యూహలు వాయువేగమునో వేగంగా దొర్లుతున్నవి.

"తప్పకుండా వస్తానని, వచ్చి పిలుచుకొనివెళతానని వ్రాశాడుకదా! ఎందుకురాలేదబ్బా! ఖర్మం చాలక మామగారికి తెలిసి మరల అడ్డుపడ్డాడేమో! అయినా అయియుండవచ్చు"

గతమంతా స్ఫురణకువచ్చేసరికి పద్మకంపించి పోయింది. క్రిందటి ఉగాదినాడే తనభర్తకు, తనకూ ఎడబాటు ఏర్పడింది. ప్రభాకరంపండుగకు అత్తగారింటికివచ్చాడు. కొత్తఅల్లుడికి జరుగవలసిన మర్యాదలతో మామగారు వెంకట్రామయ్య అపోశనపోశచేసి ఒక రెడీమేడ్ సూటు, పద్మకు ఒకచిల్కచీర కొనిపెట్టి "ఈ సారికి యిలాగ వెళ్లిపోనీ నాయనా! ఇంతకంటె మీకివ్వడానికి ఏమి అవకాశం లేకపోయింది. రానున్న పండుగకయినా రేడియో, సైకిలు ..." అని ప్రార్థనా పూర్వకంగా అన్నాడు. పద్మకు పరిస్థితులు తెలుసు కాబట్టి తలవంచుకుంది. ప్రభాకరం సయితం "దానికేంలెండిమామగారూ! అవకాశమున్నపుడే యిద్దురుగాని; ఆ విషయంగా మీరేమీయిబ్బందిపడవద్దు" అన్నాడు. అల్లునిమంచితనానికి వెంకట్రామయ్యగారు సంతోషపడ్డాడు.

వెంకట్రామయ్య స్కూలు మాష్టరు. ఆస్థి పాస్తులున్నవాడుకాడు. ఊళ్లోగల పరపతి, తనమంచితనంవలన గౌరవంగా జీవయాత్ర సాగిస్తుండేవాడు. ఆయనకు ఒకకొడుకు, పద్మ ఒక్కతేకుమార్తె. పద్మమీద తండ్రికేకాదూ యింటిల్లిపాదికి అభిమానమెండు. పద్మ అందచందాలలోను, తెలివితేటలలోను యింటబయటకూడ అభిమానపాత్రురాలుగానుండేది. అష్టకష్టాలైనా పడి ఆమెకు స్కూలు ఫైనలు దాక చదివించాలను దీక్షపూనాడు వెంకట్రామయ్య. ఏనాటికైనా ఆడపిల్లను ఒక అయ్యచేతిలో పెట్టవలసిందేకదాయని స్కూలు ఫైనలు కాగానే పద్మకు వివాహసంబంధాలు వెతకడం మొదలు పెట్టారు ఆప్పట్లో అదృష్టంకొద్దీ ప్రభాకరం ఆమెకు జీవిత భాగస్వామిగా నిర్ణయమయ్యాడు.

ప్రభాకరం సంపన్నుల యింటిబిడ్డ. బి, ఏ. ప్యాసయినాడు. సన్నంగా, పొడుగ్గా నాజూకుగానుండేవాడు. అతడు అభ్యుదయవాదిగా కట్నకానుకలకు వ్యతిరేకికాని, తండ్రి పరంధామయ్యకు మాత్రం కుమారుడు పుట్టినప్పటినుండి బి. ఏ. ప్యాసయ్యేదాక అతనికి ఎంత ఖర్చుపెట్టాడో వడ్డీతోసహా వరకట్నరూపంలో రాబట్టాలనే మనస్తత్వంగలవాడు. పరంధామయ్య పెద్దకుమార్తె వచ్చి తండ్రిని "నాన్నా! ప్రభాకరంకు మా అమ్మాయిని యిచ్చిచెద్దాం. మా

ఆస్తిపాస్తుల విషయం నీకు తెలుసుకాబట్టి మాశక్తి ననుసరించి కట్నంకూడ యిస్తాం" అని అడిగితే పరంధామయ్య "అదేమిటమ్మాయ్ అలాగంటావు! ప్రభాకరంకు యీనాటివరకు చదువుసగ్గెరాలకు 16 వేల రూపాయిలు ఖర్చయినవి. కనీసం యిరవైవేలైనా కట్నంరాదాయని ఎదురుచూస్తున్నాను. సంబంధాలకేం అనేకంవస్తున్నవి కాని... యిప్పుడే ఏం తొందరలేయని యూరుకున్నాం. ఈ పరస్థితులలో నన్నేం చేయమంటావో చెప్పనీవే!" అన్నాడు. కూతురు, అల్లుడు కిక్కురుమనకుండా వెళ్లిపోయి తమకు తగ్గచోటయిచ్చి కూతురుకి పెళ్లి చేశారు. కట్నకానుకలు రాబట్టే విషయంలో ప్రభాకరంకు నచ్చచెప్పాలని పరంధామయ్య నయాన, భయానఎంతగానో చెప్పాడు. కాని ప్రభాకరం సమ్మతించక కట్నకానుకలతో ప్రమేయంలేకుండానే కోరి పద్మను వివాహమాడ నిశ్చయించుకున్నాడు. ఒక్కడే కావడంవల్ల కుమారుని పై మమకారంకొద్దీ ఆ వివాహానికి సమ్మతించక తప్పిందికాదు. ఉన్నంతలో ప్రభాకరంకు పద్మనిచ్చి వైభవంగా వెంకట్రామయ్య వివాహం చేశాడు. అల్లుడు కోరకపోయినా అలకపాన్పుమీద రిస్టువాచ్, ఉంగరం యిచ్చాడు. ఈడు జోడుగానున్న దంపతులను బంధుమిత్రులు అభినందించి ఆశీర్వదించారు.

పరంధామయ్య మాత్రం తనమాట చలామణి కాలేదనే అక్కసుతో పెండ్లి సందర్భమున బావగారూ! కట్నకానుకలు లేనేలేవు. పోనీ అల్లుడికి ఒక రేడియో, సైకిలైనా కొనిపెడ్తే బాగుంటుంది నలుగురిలో" అన్నాడు పరంధామయ్య.

వెంకట్రామయ్య ఏమిమాట్లాడలేక మౌనంవహించే సరికి అంగీకారసూచకమైంది. అప్పటినుండి కొనాలనుకున్నా వెంకట్రామయ్యకు పరిస్థితులనుకూలించలేదు. ఏం చేస్తాడుపాపం! ఆదాయం నిత్యావసరాలకే చాలీ చాలనట్లుంటుంది. కాలం చూద్దామా అంటే ఏది చూడబోయినా కొనబోతే కొరివిగానున్నది. ముఖ్యంగా మధ్యతరగతివారు అభిమానానికి ప్రాకులాడుతూ పడుతున్నయాతనలు అనేకం. పండుగకు గుడ్డలు కొనడానికే కటకటలాడింది.

అల్లుడు గడియారం, సైకిలుకు పట్టుపట్టకపోయినా ఏనాటికైనా పరంధామయ్యతో పేచీవ్యవహారమేనన్న భయం మాత్రం వెంకట్రామయ్యను బాధిస్తూనే యుండేది.

పండుగ వేడుకలలో యింటిల్లిపాది కులాసాగా కాలంగడుపుతుంటే మిట్టమధ్యాహ్నమప్పుడు గొడుగు చంకనపెట్టుకొని, చేతిలో ఒకకాకీ సంచితో పరంధామయ్య ప్రత్యక్షమయ్యాడు. ఆయన రాలకం చూడంగానే వెంకట్రామయ్యకు అనుమానంకలిగింది. ఆయనరాంగానే వెంకట్రామయ్య పరామర్శచేసి కాళ్లకు నీళ్లప్పించి స్నానంచేసి భోజనానికి లెమ్మన్నాడు.

పరంధామయ్య "భోజనానికేంలెండి! ప్రక్కవూళ్లో పనియుండివచ్చి, యిక్కడికిలా చూచిపోదామని వచ్చాను. ఇంతకీ అల్లుడికి యీసారైనా రేడియో, సైకిలు కొనిపెట్టాగా" అన్నాడు కండ్లు పైకి ఎగవేస్తూ.

ప్రభాకరం తలవంచుకునే "నాన్నగారూ! మామగారు ఏదోయిబ్బందుల్లో నున్నట్లున్నది, ఎప్పుడో అవకాశం ఉన్నప్పుడుకొని పెడతారు– అవి లేనిదానివలన మనకిప్పుడు జరుగనిదేమిటి?" అన్నాడు.

ఆమాటలు విని పరంధామయ్య మండిపడ్తూ "చాలు! చాలు! మావును వెంటేసుకొని మాట్లాడుతున్నందుకు సిగ్గైనాయున్నట్లు కనుపించడంలేదు. పెండ్లినాడు కట్నంలేకపోగా, ముద్దుముచ్చట్లుకని రిస్టువాచ్, సైకిలయినా కొని యివ్వడానికి యింతవరకు గతిలేదు. ఇప్పుడు కాకపోతే యింకెప్పుడిస్తాడు? పదివేలు పదిహేనువేలు కట్నమిచ్చి పిల్లనిస్తామనివచ్చిన బంగారంవంటి సంబంధాలు మానుకొని చివరకు యీ దరిద్రపు సంబంధం మనకు దాపరించింది. ఇకఒక్కనిముషమైనా యిక్కడ నిలవకూడదు – పదముందు" అని గద్దించి పైపంచ సవరించుకుంటూ ముందుకు నడిచాడు. ప్రభాకరం చిన్నబోయిన ముఖంతో ఆయన ననుసరించక తప్పిందికాదు. వెంకట్రామయ్యకు నడుములు విరిగినట్లయింది. పద్మ కండ్ల నీళ్లు క్కండ్లగ్రుక్కుకుంది: ఆయన కుమార్తె దాంపత్యజీవితంలో నేమి విషమపరిణామాలు రానున్నవోయని వాపోవసాగాడు. పద్మ మానసికంగా తన భవిష్యత్తునుగురించి కలవరపడుతున్నా తన్ను చూచి అల్లాడుతున్న తల్లి దండ్రులను ఓదార్చి ధైర్యం చెప్పవలసివచ్చింది.

రెండు నెలల తరువాత ప్రభాకరం దగ్గరనుండి తను యిల్లువదలిపెట్టి పోయి మద్రాసుచేరాడనియు, అక్కడ ఉద్యోగంకోరకు ప్రయత్నము చేస్తున్నాడని జాబువచ్చింది. తర్వాత కొంతకాలానికి మంచి ఉద్యోగం దొరికిందని త్వరలోవచ్చి పద్మను పిలుచుకొని వెళ్తానని ప్రభాకరం జాబువ్రాశాడు, అలా సంవత్సరం గడచింది. వెయ్యికండ్లతో భర్త రాకను పద్మ ఎదురుచూడసాగింది. వెంకట్రామయ్య ఉగాదికి రమ్మని అల్లునికి జాబువ్రాస్తే తప్పకవస్తానని వ్రాశాడు. దాన్నిచూచే పద్మ, యింటిల్లిపాది గంపెడాశతో అల్లునిరాకకు ఎదురుచూడసాగారు,

ఇలా పరిపరి విధాల ఆలోచిస్తుండగానే వాకిట్లోనుండి "అక్కయ్యా! బావవస్తున్నాడే" అంటూ ఆమె తమ్ముడు గదిలోకిపారివచ్చాడు. చిరునవ్వుతో గడపలు ఎక్కివస్తున్న ప్రభాకరంను ఆనందభాష్పములతో పద్మ స్వాగతమిచ్చింది. వెంకట్రామయ్య, భార్య ఆనందపరవశులై అల్లుని మర్యాదలతో యింట్లోకి తీసికొనివెళ్లారు.

ఆ నాడు రాత్రిబండికే ప్రభాకరం ప్రయాణం కట్టాడు. వెంకట్రామయ్య మధ్యాహ్నం భోజనాలయాక సైకిలు, రేడియో వద్దంటున్నా అల్లునకిస్తూ "నాకు మాత్రం మరెవ్వరు నూరుమందియున్నారు? ముద్దుముచ్చట్లకయినా పద్మ ఒక్కతేకదా ఆడపిల్ల! నేను యివ్వవలసినవాడను–నీవు తీసుకోవలసినవాడవు. నీవు మా యింటి అల్లుడవుకావడం మా అదృష్టం. ఇంతకాలం వసతి చిక్కక యివ్వలేకపోయాను – యీనాడు అమరినవి – తీసికోనాయనా! భార్యభర్తలు మీరిద్దరు ఆయురారోగ్య ఐశ్వర్యాలతో వర్ధిల్లండి" అని దీవించాడు, ఆరాత్రి బండికి కూతురిని, అల్లుణ్ణి రైలెక్కించి మద్రాసుకు పంపాడు వెంకట్రామయ్య. కుమార్తె ఎడబాటు కష్టమనిపించినా ఆమె సౌభాగ్యం చూచి మతిస్థిమితపరచుకున్నారు.

రెండు సంవత్సరాలకు పద్మకు పండంటికొడుకు పుట్టాడు. పరంధామయ్య మాత్రం ప్రభాకరం తన మాటవినలేదని అతని జోక్యం పట్టించుకోకుండా, చూచి రావడానికి కూడ వెళ్లాడుకాదు. లంకంతయింటో పిల్ల, జల్లలేకుండా బిక్కుబిక్కుమంటూ పరంధామయ్య భార్యతోనుండేవాడు. ఒక్కొక్కప్పుడు మనుమని, కొడుకుకోడల్ని పోయిచూచి వద్దామనిపించినా ఆత్మాభిమానం అడ్డుపడేది పరంధామయ్యకు. మనోవ్యాధితో కొంతకాలానికి ఆయన మంచంపట్టాడు. చాల బలహీనస్థితి ఏర్పడేసరికి గత్యంతరములేక ఆయన స్నేహితుడు రామనాథం ప్రభాకరంకు టెలిగ్రాం యిచ్చేసరికి ప్రభాకరం, పద్మ బిడ్డనెత్తుకొనివచ్చారు.

"నాన్నా! ఎలాగుంది" అని అడిగాడు ప్రభాకరం మంచందగ్గరకువెళ్లి, పద్మ కుమారుని చేతులలో ఎత్తుకొని ప్రక్కనే నిలబడింది.

పరంధామయ్య వాళ్ళను చూచి వెక్కివెక్కి ఏడ్వసాగాడు. "వచ్చారా నాయనా! యిలాగున్నాను. ఇంతకాలం మిమ్ములను వచ్చిచూడనైనా నోచుకోని కఠినుడను" అన్నాడు ఆయాసంతో,

పద్మ "ఊరుకోండి! మామగారూ! యిదుగో బాబు" అంటూ పిల్లవాణ్ణి పరంధామయ్య మంచంమీదకూర్చొనబెట్టింది.

పరంధామయ్య మెల్లగాలేచి కూర్చొని బాబును ఒళ్లో కూర్చొపెట్టుకున్నాడు.

రామనాథం నవ్వుతూ "పరంధామయ్య జబ్బు ఎగిరిపోయింది. ఇంతకాలమిది మనోవ్యాధి. రెండు రోజులు కోడలి సపర్యలతో గుర్రంలాగ లేచినడవడూ!"అంటు యింటికి వెళ్ళిపోయాడు. పరంధామయ్యకు సంపూర్ణారోగ్యం చేకూరింది. మర్నాడు యుగాది ఆరోజే. ఇల్లు కళకళలాడుతూ సందడిగానున్నది. మనుమని ఆడిస్తూ పరంధామయ్య మురిసిపోతున్నాడు. భోజనాలయాక ప్రభాకరం తండ్రితో తనకిక సెలవులేదని, మరునాడు ప్రయాణమయి వెళ్ళాల్సియున్నదని చెప్పాడు.

"ఈ వయస్సులోనున్న నన్ను మీయమ్మను వదలి వెళ్ళదలచుకున్నారా? నీవు పోయి సంపాదించి సాధించేది మాత్రంఏమిటి? మనకు భగవంతుడు ఏ లోటులేకుండా యిచ్చాడు. అంతగా నీవింకా డబ్బు సంపాదించదలచుకుంటే లాచదివి యిక్కడే ప్రాక్టీసు పెట్టుకొని యింటి పట్టననుండవచ్చును. ఏమమ్మా పద్మా! నీవు చెప్పమ్మా, మమ్మలను వదలిపోవడం మీకు ధర్మమేమో"నని పసిపాపలాగ వలవలలాడాడు.

"అదేమిటండీ! మామగారు అంతగా చెప్పుతుంటే ఎప్పుడో ఏదో అన్నారని వెళ్ళిపోతా

నంటారా ? ఆయనకు మాత్రం మనంతప్ప మరెవ్వరు న్నారు ? వృద్ధాప్యంలో ఆయనమనను కష్టపెట్టడం మనకు మాత్రం ఏమి క్షేమకరం!" అన్నది పద్మ ప్రాధేయపడ్తూ.

ప్రభాకరం ఏది మాట్లాడలేక "మీ యిష్టమది అయితే నేను మాత్రం కాదంటానా" అంటూ లోపలికి వెళ్ళాడు. ప్రభాకరం వెళ్ళి మద్రాసులో ఉద్యోగానికి రాజీనామయిచ్చి యిల్లుఖాళీచేసి సామనులతో తిరిగివచ్చాడు.

కొడుకు, కోడలు కాపురంచేస్తుంటే పరంధామయ్య దంపతులు మనుమని ఆడించిపాడించి ఆనందిస్తుండేవారు. ఉగాదితో ఆరంభమయిన తగాదా ఉగాదితోనే తీరి సౌభాగ్య సంపద సమకూరిందని పరంధామయ్య, పద్మ కూడ అనుకుంటుండేవారు.



# పొగరుబోతు

ఒక పేదవాడు అడివికి వెళ్ళి కట్టెలు కొట్టుకొని వీపుమీద వేసుకుని పట్టణంలో అమ్ముకొనేందుకు వెళ్లేడు. కట్టెలు పొడవుగా వున్నందువల్ల ఎవరికైనా తగులుతా యేమోనని వాడు "అయ్యా, మీబట్టలు జాగ్రత్త! బట్టలు జాగ్రత్త!" అని అరుచుకుంటూ వెళ్లేడు.

ఆదారెంట వెళుతున్న, పొగరుబోతు వొకడు కట్టెలు కొట్టుకునే యీ దరిద్రుడికి దారిచ్చి ప్రక్కకి తప్పుకోవడమేమిటనుకున్నాడు. అతని కోటుకొక కర్ర తగిలి బాగా చిరిగింది. పొగరుబోతు కోపంతో రెచ్చిపోయాడు. అతడు పేదవాడిని న్యాయమూర్తి వద్దకు యీడ్చుకెళ్ళి తనకు జరిగిన నష్టానికి పరిహారం యివ్వాలని కోరేడు. ఈ నష్టం ఎలాజరిగిందని న్యాయమూర్తి చాల సార్లు అడిగాడు, కాని పేదవాడు ఒక్కమాటైనా ఆడలేదు.

"ఈ మూగవాడిని నాదగ్గరకెందుకు తీసుకు వచ్చావయ్యా? వాడినుండి నేను ఏ విషయమూ తెలుసుకోలేను, ఏం లాభం?" అన్నాడు న్యాయమూర్తి పొగరుబోతుతో.

"అయ్యా! వాడు కేవలం మూగవాడిలా నటిస్తున్నాడండీ. వాడు వీధిలో కట్టెలు మోసుకెళ్లుతూ" అయ్యా మీ బట్టలు జాగ్రత్త" అని కేకలేస్తూ నడిచాడు" అన్నాడు పొగరుబోతు.

"సరే అయితే, వాడలా అరిస్తే నువ్వెందుకు జాగ్రత్తపడలేదు? "అని న్యాయమూర్తి కేసు కొట్టివేశాడు.

# మంచి యజమాని పాటించవలసిన పది ధర్మాలు

శ్రీ వార్కీ చెరియన్



"నీకు ఎంత పెత్తనం ఉంటే నీలో అంత అడకువ ఉండాలి. నీ కింద పనిచేసే ప్రతి ఒక్కరినీ మర్యాదగా చూడాలి". మంచి యజమాని పాటించ వలసిన "పది ధర్మాలలో" ఇది మొదటిది. ఈ పది ధర్మాలను చెప్పినవారు ఒక అమెరికన్ యాజమాన్య విషయాల నిపుణుడు.

భారత దేశంలోని అమెరికా సాంకేతిక సహకార కార్యాలయంలో పారిశ్రామిక యాజమాన్య విషయాల సలహాదారుగా ఉంటున్న శ్రీ ఎల్గిన్ ఒ. కెల్లర్ ఫిబ్రవరిలో మద్రాసులో రెండు వారాల పాటు పారిశ్రామిక యాజమాన్య విషయాలు నేర్పే తరగతులు నిర్వహించాడు. ఈ తరగతులను మద్రాసు ప్రాంతపు ఉత్పాదన విషయాల మండలి ఏర్పాటు చేసింది.

ఈ తరగతులకు మద్రాసులోని పరిశ్రమలలో, వ్యాపార సంస్థలలో అసిస్టెంటు మేనేజరు వంటి ఉద్యోగాలలో ఉన్నవారు 30 మంది విద్యార్థులుగా చేశారు.

ఇట్లా వ్యాపార నిర్వహణగురించి తరగతిలో పాఠాలు నేర్చుకోవటమనేది ఈ దేశంలో కొత్తసంగతే. అయినప్పటికి ఈ తరగతులు తమకు బాగా ఉపయోగపడ్డట్లువీటిల్లో పాల్గొన్న అభ్యర్థులే స్వయంగా చెప్పారు,

ఈ విద్యార్థులలో శ్రీ ఆర్. జగదీశ్వరన్ ఒకడు. ఈ తరగతులను చివరిరోజు జరిగిన స్నాతకోత్సవ సందర్భంలో శ్రీ జగదీశ్వరన్ తన అనుభవాన్ని గురించి ఇట్లా చెప్పాడు. ఇట్లా తరగతులు నిర్వహించటం చాల ఉపయోగం. లాభదాయకం. ఆధునిక కాలంలో మేనేజిమెంటు (యాజమాన్యం) అనేదాన్ని గురించి మాలో కొందరికి తెలియని కొత్తభావాలు ఎన్నో ఉన్నాయి. అయితే అవన్ని ఎంతో ఉపయోగకరమైనవి. ఈ తరగతుల్లో పాల్గొనే అవకాశం కల్గినందుకు నేనెంతో సంతోషపడుచున్నాను. నేనూ ఇంకా నాతోపాటు వీటిల్లో పాల్గొన్న ఇతరులు ఎన్నో సంగతులు నేర్చుకొన్నాము.

"శ్రీ కెల్లర్ ఈ శిక్షణ ఇవ్వటంలో అనుసరించిన శాస్త్రీయపద్ధతి మా అందరికి ఎంతో బాగా నచ్చింది. ముఖ్యంగా సమాలోచనలు (కాన్ఫరెన్సు) పద్ధతి, విషయ పరిశీలన (కేస్ స్టడీ) పద్ధతి చాలా బాగున్నవి."

శ్రీ ఎం. రామ సుబ్రహ్మణ్యం అనే మరొక అభ్యర్థి తన అభిప్రాయం ఇట్లా వెలిబుచ్చాడు. "అటు యజమానుల, ఇటు కార్మిక సంఘాల మధ్య సంఘర్షణలో ఈ రెండు వర్గాలలో దేనికీ చెందని మేనేజరు నలిగిపోవలసి వస్తున్నది. శ్రీ కెల్లర్ మాకు నేర్పిన పాఠాలు ఈ విషయంలో వివేక పూరితమైన మార్గం చూపగలవని నాకు నమ్మకం కల్గింది."

ఈ తరగతుల సందర్భంలో ముఖ్యంగా పరిశ్రమల్లో మనుషులకు మనుషులకు మధ్య సంబంధాలను గురించి ఎక్కువ

శ్రద్ధగా పరిశీలించారు. యాజమాన్య నిర్వహణలో ఈ అంశాన్ని ముఖ్యంగా పరిగణించవలసిన అవసరాన్ని నొక్కి చెప్పుకొన్నారు. ఒక సమస్య మీద నిశ్చయానికి వచ్చే ముందు దానిని గురించి బాగా ఆలోచించవాలనే విషయం ఈ జూనియర్ మేనేజర్లకు బాగా నచ్చింది.

శ్రీ కెల్లర్ వీరికి నేర్పిన వాటిల్లో, యాజమాన్య సిద్ధాంతం, దాని భావం, మేనేజరు పాటించవలసిన నిబంధనలు, అతని బాధ్యతలు, సంప్రదాయాలను ఏర్పాటు చేయటం, పరిశ్రమలలో నాయకత్వం, విషయ వివరణవంటి అంశాలు ఉన్నాయి. ఈ తరగతులు ముఖ్యంగా సమావేశాల ఫక్కీలో మద్రాసు ప్రొడక్టివిటీ కౌన్సిల్ కార్యాలయంలో ఒక పెద్ద గదిలో జరిపారు. విషయ పరిశీలన (కేస్ స్టడీ), పాత్రనిర్వహణ, దృశ్య శ్రవ్య సాధనాలు కూడా ఈ తరగతుల్లో ఉపయోగించారు.

జాతీయ ఉత్పాదన మండలికి దాని సమావేశ నాయకత్వం శిక్షణ కార్యక్రమం (కాన్ఫరెన్సు లీడర్‌షిప్ ట్రెయినింగు ప్రోగ్రాం) విషయంలో సహాయపడటానికి మూడేళ్ల క్రితం ఇండియావచ్చిన శ్రీ కెల్లర్ ఈ జూనియర్ మేనేజర్ల శిక్షణ కోర్సు రూపొందించారు. ఇటువంటి తరగతులను ఆయన ఇదివరకే కాన్పూరు, ఢిల్లీ బొంబాయి, నగరాలలో నిర్వహించి ఉన్నారు. కాన్పూర్ తరగతుల్లో బలవంతాన చేసిన ఒక అభ్యర్థి అనంతరం తన యాజమాన్యాన పని చేస్తున్న లఘు పరిశ్రమలను ఎంతో అభివృద్ధి చేయగలిగి ఈ తరగతుల ఉపయోగాన్ని నిరూపించాడు.

ఈ దేశంలో ఇటువంటి శిక్షణ ఎంతో అవసరం ఉన్నదని శ్రీ కెల్లర్ అభిప్రాయం. ఇంకా, విశ్వవిద్యాలయాలలో ఈ శిక్షణ గరపే స్థితి రానందున ఈ తరగతులు ఉపయోగమంటారాయన. అమెరికాలో ఏటా 80,000 మంది విద్యార్థులు విశ్వవిద్యాలయాలలో పారిశ్రామిక నిర్వహణ శాస్త్రంలో పట్టభద్రి తరగతులే గాకుండా స్వల్ప కాలిక శిక్షణ తరగతులుకూడా నడుపుతున్నారు.

శ్రీ కెల్లర్ చాల సంవత్సరాల పాటు పెన్సిల్వేనియా స్టేట్ యూనివర్సిటీ విస్తరణ విభాగంలో పనిచేశారు. ఎనిమిదేళ్ల క్రితం ఈయన అమెరికా అంతర్జాతీయ సహకార శాఖ (డి. సి. ఎం. మైత్రి సంస్థ) ఉద్యోగంలో చేరారు. ఆయన అమెరికాలో ఉండగా డిక్వెన్సు లైట్ కంపెనీ (పిట్సుబర్గ్)లో సంబంధం ఉన్నందునే ఆయనకు పారిశ్రామిక నిర్వహణలో ప్రత్యక్షానుభవం కూడా ఉన్నది.

కనుక మంచి యజమాని పాటించవలసిన పది ధర్మాలను! ఆయన తన విస్తృతానుభవంనుంచే నిర్వచించారనవచ్చును. ఆ పది ధర్మాలలో "నిజాయితీ, సి క్రింద పనిచేసేవారి హక్కుల కోసం నిలవటం, తప్పు లెప్పుడూ ఇతరులమీద నెట్ట చూడకుండా ఉండటం, అన్న మాట నిలబెట్టుకోవడం, ఉదారంగా అప్పులివ్వటం, పని చేసేవారిని పొగిడి చేయించటం, ఎప్పుడూ మంచిగా ఉండటం" వంటివి ఉన్నవి.




# సాహసవీరులు

శ్రీ కానాధిభట్ల వెంకటసుబ్బారావు



(గతసంచిక తరువాయి)

ఇంతలో "ఆగండి!" అని కేక వినిపించింది. అందరూ వుల్కిపడి వెనక్కి తిరిగి చూశారు.

హరకుమార్ చంపిన పులిని ఈడ్చుకుంటూ అక్కడికి వచ్చాడు. "పాయిసం" గబగబా వచ్చి భర్త పాదాలను ఆనందభాష్పాలతో అభిషేకించింది.

"నిన్ను పులి ఎత్తుకుపోలేదూ!" వణుకుతున్న కంఠంతో అన్నాడు శివబంటు.

హరకుమార్ నవ్వుతూ, "నన్ను పులి ఎత్తుకుపోగానే చనిపోయానని చెప్పావా! అందుకా యీ హంగామా! భళే! నన్ను పులి కొంతదూరం తీసికెళ్ళి క్రింద పెట్టింది. వెంటనే లేచి దాని నోరు చీల్చిపారేశాను. విలవిల్లాడుతూ ప్రాణాలు వదిలింది. చూశారుగా పులిని" అన్నాడు.

మహారాణి, రాజు తమ అల్లుడు క్షేమంగా తిరిగి వచ్చినందుకు ఆనందభాష్పాలు రాల్చారు.

ప్రజలు హరకుమార్‌ను సాహసవీరుడని పొగిడారు.

"మహారాజా! మేము వెంటనే మా స్వదేశం వెళ్ళిపోవాలి. నా తల్లిదండ్రులు నా కోసం ఎంత దిగులు చెందుతున్నారో! వెంటనే ప్రయాణపు ఏర్పాట్లు చేయించండి!" అన్నాడు హరకుమార్.

"అవును యువరాజా! త్వరగా వెళ్ళాలి. మా అమ్మ నాకోసం ఎంత దిగులడిందో" అన్నాడు గద్గదికంగా శివబంటు.

"ఈరోజుకు ఇక్కడ వుండండి – రేపుదయమే ప్రయాణపు ఏర్పాట్లు చేయిస్తాను" అన్నాడు రాజు. మహారాజు మాట తీసివేయలేక సరేననవలసి వచ్చింది.

హరకుమార్ శివబంటుతో "నీవీ ఉత్తరాలను తీసుకెళ్ళి ఉజ్జయినీ నగరం మహారాజుగారికీ, గంధర్వలోకానికెళ్ళి విస్తునకు ఇచ్చి వారి ఏర్పాట్ల ప్రకారం దేవేరులను వెంటబెట్టుకురా!" అన్నాడు. శివబంటు ఉత్తరాలు తీసుకుని చిటికలో కనుమరుగయ్యాడు.

తెలతెలవారుతుండగా ఇక్కడి ఏర్పాట్లయినై. ఇంతలో శివబంటు కూడా వచ్చేశాడు వార్ని వెంటబెట్టుకొని.

హరకుమార్ రాజపరివారంతో బయలుదేరి మృణాళినీ నగరం చేరుకున్నాడు. క్షేమేంద్రుడు, సుగుణ ఎదురేగి కొడుకునూ, కోడంద్రనూ లోపలికి తీసుకొచ్చారు. హరకుమార్ గదిలోకి అడుగు పెడుతూనే వున్నట్లుండి వెనక్కి విరుచుకు పడిపోయాడు. కొంచెంసేపు గిలగిల్లాడి ప్రాణాలు వదిలాడు. ఇంకేముంది? ఎంత సంతోషంగా కొడుకునూ, కోడంద్రనూ ఆహ్వానించారో అంత విపరీత దుఃఖంలో మునిగిపోయారు రాజదంపతులు. యువరాజు మరణంతో యువరాణుల దుఃఖానికి తీరమే లేదు. ఉన్నట్లుండి క్షేమేంద్రున కోసంగతి గుర్తునకొచ్చింది. "అయ్యో! ఎంతపని జరిగింది దేవి! నీకీ సంగతి చెప్పనేలేదు. మన యువరాజుకు పాతికేండ్లవరకే

ఆయుష్షు. ఇలా అని మహాదేవి ప్రథమంలోనే నాకు చెప్పింది. అందుకు అంగీకరించే పుత్రుని కోరాను" అని ఆనాడు జరిగినదంతా చెప్పాడు.

"ఏకైక పుత్రుడు మరణించినతర్వాత ఇంకా మాకీ రాజ్యమెందుకు? ఈ భోగమెందుకు? బ్రతికివుండి కోడండ్ర వైధవ్య వ్యథని కండ్లారా చూడమనేనా తల్లీ! నీవు మాకు ప్రసాదించిన సంతోషం ఈ దుఃఖాన్ని చూస్తూ ఇక మేము బ్రతకలేము" అని ఖడ్గం పుచ్చుకుని కుత్తుక నుత్తరించుకోబోయాడు.

ఇంతలో భవాని ప్రత్యక్షమై "సాహసించకయ్యా మహారాజా! మహారాణీ! మీ పుత్రుడు జీవించటానికి ఒకే మార్గముంది. మీ పుత్రునకత్యంతాప్తుడైన వాడెవడైనా నా రక్తతర్పణం చేయగలిగితే మీ కొడుకు పునర్జీవితుడవుతాడు!" అంది.

ఇంతలో శివబంటు ముందుకొచ్చి "నా యువరాజుకోసం నేను బలియవుతాను!" అని సిద్ధపడినాడు. "అయ్యో! నా బిడ్డా!" అంటూ నీలీ అడ్డుపడింది. కాంచనం, మిఠాయి పొట్లం భర్తకు అడ్డుపడి ఏడవసాగారు. శివబంటు ఇవ్వేమి లెక్క చేయలేదు. ఖడ్గంతో కుత్తుక నుత్తరించుకున్నాడు. శివబంటు ప్రాణత్యాగంతో హారకుమార్ లేచి కూర్చున్నాడు.

"మహాదేవీ! మా భర్త మరణించిన తర్వాత ఇంకా మేం బ్రతికివుండి ఏం బావుకు తినటానికి! మా ప్రాణాలుకూడా తీసుకో తల్లీ" అని ఖడ్గాన్ని ఎత్తారు. "భేష్! మీ పాతివ్రత్యానికి నా హృదయం పుష్పాంగిపోయింది. మీకేం కావాలో కోరుకోండి" అంది భవాని. "మా భర్తను ప్రసాదించు దేవీ!" ఏకకంఠంతో అడిగారు. "అలాగే" అని పార్వతి శివబంటును పునర్జీవితుడిని చేసింది. కండ్లు నలుపుకుంటూ లేచి నుంచున్న భర్తను కౌగిలించుకొని ఆనందభాష్పాలు రాల్చారు. పార్వతి అందర్నీ ఆశీర్వదించి అంతర్ధానమైంది.

మరునాడే క్షేమేంద్రుడు యువరాజుకు పట్టాభిషేకం చేశాడు. యువరాజు శివబంటును మంత్రిగా చేసి అతని ఋణం తీర్చుకున్నాడు. శివబంటు నీడలో నీడలా అతనిని అనుసరిస్తూ కాలం గడుపుతున్నాడు. హారకుమార్ జనరంజకంగా పరిపాలిస్తూ తన దేవేరులైన రమణీ, స్వరూప, లీల, విమల, సుశీల, సుమతులతో రంగరంగ వైభవముల ననుభవిస్తూన్నాడు శివబంటు మిఠాయిపొట్లం, కాంచనలను ఆనందాబ్ధిలో నోలలాడించుతూ ఎంతో ఆనందంగా కాలం గడుపుతున్నాడు.

---

# పరశురాముడు

శ్రీ బొడ్డుపల్లి కృష్ణావధాని

బాలలూ! శ్రీరామ చంద్రుణ్ణి మించిన పితృ ఆజ్ఞాపాలకుడున్నాడు - మీకు తెలుసునా? అతడే పరశురాముడు

పరశురాముని తల్లి రేణుక. తండ్రి జమదగ్ని. అన్నలు ఆరుగురు: జమదగ్ని ఒక రోజున భార్య శీలాన్ని శంకించి తన పెద్ద కుమారుని పిలచి "నీతల్లిని వధించి ఆశిరస్సు నాకు చూపి ముదము చేకూర్చుము" అనెను. అందుపై అతడు 'తండ్రీ! మీ రే కార్యాన్ని చేయమన్నా చేయగలను. కాని నవమాసాలు మోసికన్న, తల్లిని వధించలేను.'' అని సవినయముగా మనవి చేసికొనెను. వెంటనే తండ్రి మండిపడి శపించాడు. ఆశాప ఫలితంగా శిలై పోయాడాతడు.

అలాగే మిగతా ఐదుగురు కుమారులను అడిగి వారు నిరాకరించగా వాళ్లను గూడ జమదగ్ని శపించాడు.

ఆఖరికి చిన్నవాడైన పరశురాముని పిలచి "నాయనా చిన్నతనంనుండి నాయ దుభక్తిశ్రద్ధలు గలవాడవు నీవేసుమా! ఆభక్తి నీకు నాయందుంటే, వెంటనే నీ

తల్లిని వధించుము.'' అని ఆజ్ఞాపించెను. వెంటనే పరశురాముడు ఆలోచించక, మరో మాటైనా మాటాడక వెళ్ళి తన ఆయుధమైన గండ్రగొడ్డలితో తల్లిని వధించి వచ్చెను.

తనకుమారుని పితృభక్తికి మెచ్చినవాడై జమదగ్ని ''వత్సా! నీ భక్తికి మెచ్చితిని వరము కోరుకో'' అన్నాడు.

వెంటనే పరశురాముడు ''తండ్రీ! నవమాసాలు మోసికని పెంచి పెద్దచేసిన తల్లిని చంపి మాతృహత్యా పాతకమును, తోటి సహోదరులను చంపి భ్రాతృహత్యా పాతకమును పొందితిని. వాటినుండి నన్ను విముక్తుని చేయుము'' అని ప్రార్థించెను.

తన కుమారుని తెలివితేటలకు మెచ్చి, జమదగ్ని పరశురాముని తల్లిని, అన్నలను బ్రతికించి, మరియు అతనికి అశేషమైన వరములను ప్రసాదించెను.

చూచారా ! బాలలూ పరశురాముడు పితృభక్తిచే పితృ ఆజ్ఞను నెరవేర్చి, యుక్తిచే తల్లిని అన్నలను ఎట్లు బ్రతికించుకున్నాడో !!

——(o)——

# రామ! రామ! శివ! శివ!

శ్రీ టి. శ్యామసుందరరావు

ఆ చిన్న గ్రామంలో శివయ్య సన్నకారు రైతు. అతనికున్న ఎకరం పొలంతో కూలి, నాలిచేసి జీవిస్తుండేవాడు. సంక్రాంతి పండుగకు, తనభార్య, బిడ్డలకు గుడ్డలు కొనుక్కోడానికని ఎల్లయ్యను వడ్డీకి అప్పు 100 రూపాయలు అడిగి తీసికున్నాడు.

రెండు సంవత్సరములు గడిచిన తరువాత శివయ్య వడ్డీతో సహా ఎల్లయ్యకీయపోగా "ఇప్పుడు తొందరేం లేదులే శివయ్యా! నాలుగు రోజులు తాళి రాత్రి పూట యింటిదగ్గరకు వస్తే డబ్బు తీసికుంటాను" అన్నాడు.

అలాగే శివయ్య డబ్బు తీసికొని యింటికి వెళితే ఎల్లయ్య అతనిని వెంటబెట్టుకొని ఊరిబయటనున్న పొలంలోని పూరింట్లోకి తీసికొనివెళ్ళి వడ్డీతో సహా పైకం తీసికొని ప్రామిసరీనోటు యింట్లో ఎక్కడో వున్నదని నాలుగు రోజులలో నిస్తాననియు చెప్పి పంపాడు.

ఎల్లయ్య తనకెప్పుడూ ద్రోహం చేయలేదుకదా యని శివయ్య నమ్మాడు. కాని పది రోజులయినా నోటును యివ్వకపోవుటచే పోయి అడుగగా "డబ్బు, డుబ్బు లేకుండా నోటు యివ్వమంటావు! — మరే మైనా పోయిందా" అని గద్దించాడు.

శివయ్యకు మీద పిడుగు పడినట్లయింది. ఎల్లయ్య ధనవంతుడు, అంగబలం కలవాడగుటచే అతనితో మాట్లాడి లాభం లేదని, జరిగిన విషయం ఊళ్లోని పోలీసు యిన్స్పెక్టరుతో మొరబెట్టుకున్నాడు.

ఎల్లయ్యను పిలిపించి "నీకివ్వాలసిన పైకం తీసికొని శివయ్యకు నోటు యివ్వలేదట నిజమేనా!" అడిగాడు ఇన్స్పెక్టర్.

"నాకు శివయ్య డబ్బిచ్చాననడం శుద్ధ అబద్ధం. ఇచ్చియుంటే నోటును వెంబడే ఎందుకు తీసికొని పోయి యుండడు!" అన్నాడు జబర్దస్తీగా ఎల్లయ్య.

శివయ్య దడదడలాడే గుండెతో "నిజంగా యిచ్చానండీ! స్వయంగా ఎల్లయ్య రాత్రిపూట ఊరి బయటనున్న తన పొలంలోని పూరింట్లో నేనిచ్చిన పైకం తీసికొని, నోటు నాలుగు రోజులలో నిస్తానని, యివ్వలేదు" అన్నాడు.

ఇన్స్పెక్టరు వారిద్దరిని "మీ యిద్దరికి సాక్ష్యాధారాలున్నవా?" అడిగాడు.

శివయ్య "ఆ రాత్రి పూరింట్లో డబ్బిచ్చేటప్పుడు నేను, ఎల్లయ్య తప్ప మరెవ్వరు అక్కడ లేరండీ" అన్నాడు.

"మాశారా ! మా ఇల్లు, వాకిలి అన్నీ యూళ్లో

ఉండగా రాత్రిపూట ఊరిబయట పూరింట్లో నాకు డబ్బిచ్చానని శివయ్య అనడం నమ్మతగ్గదేమో మీరే ఆలోచించాలి" అన్నాడు ఎల్లయ్య, తడబడుతూ.

"ఎల్లయ్యా! శివయ్య ఊళ్లో నమ్మకస్తుడు. అనవసర జోక్యాలకు పోయేవాడు కాడు. ఈ వ్యవహారంలో ఏదో నీవే దగాకోరుగా కనుపిస్తున్నావు. నిజంచెప్పి శివయ్య నోటు ఆతనికిస్తే సరే - లేకపోతే..." అని పోలీసులను పిలిచాడు. పోలీసులు వచ్చి ఎల్లయ్య చేతులకు బేడీలు తగిలించబోయేసరికి "శివ! శివ! రామ! రామ!" అంటూ ఇన్స్పెక్టర్ కాళ్లమీదపడి "దాసుని తప్పులు దండంతో సరి" యన్నట్లు తన ద్రోహపు చింతకు క్షమాపణకోరి శివయ్యకు నోటు యిచ్చేశాడు.

అప్పటినుండి ఆ యూళ్లో ఎల్లయ్య దగాకోరుగా వాడుకలోకి వచ్చాడు. తప్పుచేసింది ఒకసారైనా కళంకము మాత్రము శాశ్వతమైనదయినది.

—o—

# పిల్లి పేరు

మింగ్ రాజవంశీయుల కాలంలో (1368 - 1644) చైనాదేశంలో సాహిత్యం బాగా అభివృద్ధిలోకి వచ్చింది. "పశ్చిమ దేశాలయాత్ర" (హ్సియుచి) అన్న మహాకావ్యం భారతీయ జానపదసాహిత్యానికి యెంతో ఋణపడి ఉన్నది. ఇందులోని ప్రధాన పాత్ర అయిన సన్‌వు - కుంగ్ అనే వానరుడు చైనీస్ జానపద సాహిత్యానికి చెందినవాడే ననడంలో సందేహంలేదు. అయినప్పటికి దీనిలో భారతీయ సాహిత్య ప్రభావాలు కొన్ని కనబడతాయి. రామాయణంలోని హనుమంతునికీ, ఈవానర పాత్రకూ మధ్య అనేక సామ్యాలు కనబడతాయి. చైనీస్ మహాకావ్యంలోని ఆ వానరుడు దేవతలతోనూ, రాక్షసులతోనూ జరిపేపోరాటాలు మనకు హనుమంతుని చర్యలను స్ఫురణకు తెస్తాయి.

ఒక్కొక్కప్పుడు భారతీయ కథలు యథాతథంగా చైనీస్ సాహిత్యంలో ఉదహరింపబడుతూ వచ్చాయి. ల్యూయువాన్ చింగ్ ఉదహరించిన నీతికథలలాటి వాటిలో ఒకటి.

ఒకడు ఒకపిల్లిని యెంతో ప్రేమతో పెంచుకొంటుండేవాడు. దానిమీద తనకు గల ప్రేమ కొద్దీ దానికి 'పులి' అని పేరు పెట్టాడు. అలా ఉంటుండగా ఒకనాడతని స్నేహితుడొకడు వచ్చి, "పులి చాల బలమైన జంతువేకావచ్చు. కాని అది డ్రాగన్ జంతువంత బలమైనది కాదు. కాబట్టి పిల్లికి డ్రాగన్ అని పేరుపెట్టు" మరొకరు వచ్చి, "డ్రాగన్ పులికంటే బలమైన జంతువేకావచ్చు కాని అది స్వర్గానికి పోవాలంటే మేఘాలమీద వెళ్లవలసి వస్తుంది. కాబట్టి డ్రాగన్ కన్నా మేఘాలే గొప్పవి, అందువల్లనే పిల్లికి మేఘం అని పేరుపెట్టు" అన్నారు. "మేఘాలను వాయువు దూది పింజాల్లాగ యెగరగొట్టివేస్తుంది. కాబట్టి మేఘాలకన్నా వాయువే గొప్పది. అందువల్ల వాయువు అన్న పేరు బాగుంటుంది." అని మరొకరన్నారు "గాలి యెంతశక్తిగలదైనా గోడకు తాకినట్లయితే రెండవవైపుకు వెళ్లలేదు. కాబట్టి పిల్లికి గోడ అని పేరు పెడితే బాగుంటుంద"ని వేరొక మిత్రుడన్నాడు. "గోడయెంతగట్టిదయినప్పటికి ఎలుక దానిని తోడివేసినట్లయితే పట్టినే కూలిపోతుంది. కాబట్టి ని

పిల్లికి ఎలుకని పేరుబెట్టు'' అని ఒక పెద్ద మనిషి అన్నాడు. చివరికి అతని పొరుగున ఉన్న పెద్దమనిషి నవ్వుతూ ఇలాఅన్నాడు-''ఎలుకలను పిల్లిపట్టి చంపెయ్యగలదు. కాబట్టి మీ పిల్లికి పిల్లి అన్న పేరే ఉండ నివ్వండి. దానివ్యక్తిత్వాన్నెందుకు పోగొట్టాలి ?''

ఈ కథ మనప్రపంచం అన్ని ప్రాంతాల్లోనూ కనబడుతుంది. కాని ఇది భారతదేశంలో పుట్టిందన్న విషయాన్ని అందరూ అంగీకరిస్తున్నారు. ఎందువల్లనంటే యీకథ మనకు సంస్కృతభాష లోని ''కథా సరిత్సాగరంలోనూ' ''పంచతంత్రంలోనూ''కనబడుతుంది. భారతదేశంనుండే ఇది చైనా, జపాను దేశాలతోపాటు ప్రపంచం అన్ని ప్రాంతాలకూ పయనించింది.



# నిరుపమ

మూలం :
"నిరాల"

అనువాదం :
"అరుంధతి"

(గతసంచిక తరువాయి)

"అయితే మీరు పాటలుకూడా బెంగాలీ పాట లేనా పాడేది?

"ఆc... పాటలు పాడ్డానికి ఆడవాళ్ళే సరి. మీకు మృదుమధురమైన కంఠం యిచ్చాడు భగవంతుడు. మీరు పాడుతుంటే వీణానినాదం వస్తుంది. ఇక మొగ వాళ్ళదంటారా పట్టి కుండ శబ్దం" అన్నాడు ఆమెను తృప్తిపరచాలని.

"మునిగి చావడానికా కుండ?" అంది పకపక నవ్వుతూ.

"కాదు. ఆడవాళ్ళను పొగడడానికి."

కమల సిగ్గుపడింది. "మీకు మంచిపాటలు వచ్చి వుండవచ్చు. ఒకనాడు వినిపించాలి" అన్నాడు కుమార్.

"అది సరేగాని, మీరీవాళ మాయింట్లో భోజనం చెయ్యాలి. ఏ యిబ్బంది కలుగదులెండి" అంది కమల.

ఇద్దరూ మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. దారిలో కొంతమంది బెంగాలీవాళ్ళు కన్పించారు. అందులో కమలకు తెలున్నవాళ్ళు యిద్దరు ముగ్గురున్నారు. వాళ్ళందరూ బ్రహ్మసమాజ మతస్థులే. కుమార్‌తో కలసి నడుస్తున్న కమలను చూచి వాళ్ళల్లోవాళ్ళే నవ్వుకుని, అనుకున్నారు. "ఎవడైనా వంశాన్ని వదలిపెట్టేస్తాడు కాని బ్రహ్మసమాజంలోని ఆడ పిల్లలు మాత్రం వదలిపెట్టరు."

"మొన్నీ మధ్యనే ఒక సిక్కు రావల్పిండినుండి వచ్చి బ్రహ్మసమాజ మతస్థురాల్ని చేసుకున్నాడు" అన్నాడొకడు.

"అవునవును. ఆ మరునాడే యేం మంత్రం ఊదిందోకాని గడ్డం, మీసం తీసేసి, బెంగాలీవాడి లాగ పంచకట్టి తయారయ్యాడు" అన్నాడు మరొకడు.

"ఇక చూడు. కాబూలి వాళ్ళు - వీళ్ళు వాళ్ళు - ఒకరేమిటి — అందరూ యిల్లాగే తయారౌతారు" అన్నాడు యింకొకడు.

కమల, కుమార్‌బాబు లిద్దరూ యీ మాటల్ని వింటూ ముందుకు సాగిపోయారు. కొంతదూరం వెళ్ళిన తరువాత కమల నవ్వుతూ అంది. "అదేమైనా అర్థమైందా మీకు?"

"అంటే నేనేమీ కాబూలీవాణ్ణి, సిక్కునీకాదు. అయినా బ్రహ్మసమాజంలోని ఆడవాళ్ళు మగవాళ్ళను యెలా మభ్యపెట్టుతారో నాకర్థం కావటంలేదు" అన్నాడు ఆమెవంక చూస్తూ.

కమల సిగ్గుతో నడుస్తూ, "మీకు తెలియదన్నా నేను నమ్మను. కవులకు అన్నీ తెలుస్తాయి. మీరు కవి అయ్యేందుకు ప్రయత్నించండి."

"అంటే — ఆడవాళ్ళ మనసులు తెల్సుకునేందుకు కూడ కవులుంటారా?"

కమలకు చక్కలిగింత పెట్టినట్లైంది. నవ్వి, "ఏమండీ! మీరేమైనా సినీమాలో వేశారా?... ఏమో నాకుమాత్రం అట్లాగే అనిపిస్తోంది. లేకపోతే ఆఖరికి కాలేజీ డ్రామాల్లోనైనా వేసి వుండాలి" అంది.

"అవునవును. మీరు చూస్తూనే వున్నారుగా. ఒక అడుగు ముందుకేస్తే నాలుగడుగులు వెనక్కు పడు తున్నాయి. అట్లా వుంది నా పని. భగవంతుడికి నా మీద అంత కృప వుంది."

అతడి మాటల ధోరణిని ఆమె గ్రహించి, "వృక్షాల భాష, మేఘాల భాష వేరని మీకు తెలిసే వుంటుంది. కాని చెట్లయొక్క దాహం, వీటి ఆకర్షణ మేఘమాల తెల్సుకుంటుంది. జాలితో వాటిపై వర్షం కురిపిస్తుంది."

"నాకు తెలుసు. కాబూలీవాని హృదయ

దాహాన్ని తీర్చే కల్పనలో కావ్యరసం యెక్కువ వుంటుంది."

"వాళ్లు గ్రామవాసులు. అయినా మనల్ని అట్లా తయారుచేశారు. దాన్ని బ్రహ్మసమాజమతమే యెదుర్కోవాలి. నేటి భారతదేశంలో చాలమంది మహోన్నత పురుషులు. . . ."

"ఇందులో అనుమానమేముంది? కవిత, విజ్ఞానం, చరిత్ర, రాజనీతి — వీటి అన్నిటికంటె కూడ బ్రహ్మసమాజం ముందరే వుంది. ఈవిధంగా ప్రేమలోకూడ వుంటె తప్పా?" అనుకుంటూ, చటుక్కున ఆగి "యిదే మా యిల్లు" అన్నాడు.

"నడవండి వెడదాం. మీ యిల్లు చూద్దాం. మీ అమ్మగార్ని కలుసుకోవాలి."

ఇద్దరూ కలిసి మేడ యెక్కారు. నిరుపమ అప్పుడే టిఫిన్ చేసి కూర్చుంది. కొడుకు వస్తున్నాడని తెల్సివుండి కూడా సావిత్రిదేవి మాట్లాడకుండా కూర్చుంది. కమల గదిలో అడుగు పెట్టగానే యెదురుగా వున్న నిరుపమను చూచి ఆశ్చర్యంగా, "నువ్వా యిక్కడే వున్నావు?" అని రెండు చేతులు జోడించి సావిత్రిదేవికి నమస్కరించింది. తన కొడుకు కమలకు చదువు చెప్తున్నాడని ఆమెకు ఇదివరకే తెలుసు. అందుచేతనే కమలను చూచి లేచి తన కుర్చీలో కూర్చోబెట్టి తాను నిరుపమ ప్రక్కన మంచంమీద కూర్చుంది. కుమార్ కమలను తల్లికి పరిచయంచేసి ప్రక్క కుర్చీలో కూర్చున్నాడు. ఆ క్షణంలో కుమార్ స్వరం మామూలుగా లేదని అందరూ గ్రహించారు. నిరు రెప్ప వాల్చకుండా ఆశ్చర్యంగా కుమార్‌ను చూస్తోంది. సావిత్రిదేవి నిరువైపు చూస్తూ రామచంద్రను పిలిచింది.

"ఈవిడికేనమ్మా నేను చదువుచెప్పేది" అని కుమార్ అనగానే సావిత్రిదేవి ఆదరంగా కమలవైపు చూచింది ఆ మాటకు గాలిలోని మేఘాల్లాగ ఆనందంతో తేలిపోయింది కమల. చదువుకున్న బెంగాలీ యువతులు చాలమంది సావిత్రిదేవికి తెలుసు. బ్రహ్మసమాజమతాన్ని గురించి కూడ యెప్పుడో వింది. అయితే దాన్ని గురించి యెక్కువగా ఆమెకు తెలియదు. తాను చూచిన చదువుకొన్న ఆడపిల్లలందరిలోకి సహజంగా అందంగా వుంటుంది, బెంగాలీవాళ్ల సంస్కృతి, రూపురేఖలకు — ఒక్క నిరుపమే నిదర్శనం. ఎందుకో సావిత్రిదేవి అనుమానించింది.

నిరుపమను చూపిస్తూ "యీవిడ మీకెలా తెల్సును?" అంది కమల సావిత్రిదేవితో.

"ఈవిడ మా యజమానురాలు" అంది సావిత్రిదేవి నవ్వుతూ.

"అంటే — యీ యింటి యజమానురాలా?" అంది కమల చిరునవ్వుతో నిరుముఖంలోకి చూస్తూ. ఆ మాటకు నిరుపమకు కోపం వచ్చింది. అయినా, తమాయించుకొని, సావిత్రిదేవిని చూచి నవ్వింది.

"కాదు. మా గ్రామ జమీందారిణి" అంటూ నిరుపమను చూచింది సావిత్రిదేవి. నిరు మాత్రం రెప్ప వాల్చకుండా కుమార్‌ను చూస్తోంది. ఆ క్షణంలో కుమార్ మనసులో రకరకాల భావాలు చెలరేగుతున్నాయి. నిరుపమ యెంత గంభీరమైన మనస్సుతో కూర్చుందో అతడి మనస్సు అంత చంచలంగా వుంది, ఆఖరికి ఉండబట్టలేక "మీరు మా యింటికి వచ్చినందుకు కృతజ్ఞులం. మీకు కష్టంగానే వుండవచ్చు" అనేసి "యెంత పొరపాటైంది?" అనుకున్నాడు మనసులోనే.

కమల నవ్వుతూ "కొత్తగా అత్తవారింటికి వచ్చిన క్రొత్త పెళ్లికూతురిలా మా గనోము పట్టేరా యేమిటి?" అంది నిరుపమను చూస్తూ. సావిత్రిదేవి యీ మాటలు విని నవ్వి లోపలికి వెళ్లిపోయింది.

"అది కాదండి. ఆవిడ పశ్చాత్తాపపడుతున్నారు" అన్నాడు కుమార్ నవ్వుతూనే. కమల ఆశ్చర్యంగా అతడివైపు చూచింది. "ఒకరోజు రాత్రి ఆవిడ నన్ను గుర్తించకోకుండానే మూర్ఖుడంది" అని నవ్వుతూ నిరుపమ ముఖంలోకి చూచాడు. కమల ఏమిటి అన్న ప్రశ్నార్థకంగా కుమార్ వైపు చూచింది నవ్వుతూ. కుమార్ కమలవైపు చూడకుండానే "ఆ రోజు ఆవిడకు కొంచం కోపంకూడా వచ్చింది. తప్పు నాదికాదు. ఇప్పుడు నేను మాట్లాడిన యీ స్వరంతోనే అప్పుడు నేను పాడుకుంటున్నాను. అయినా నా తృప్తికోసం పాడుకునేటందుకు నాకామాత్రం హక్కువుంది. తర్వాత ఆవిడకూడా పాడిందనుకోండి! ఆమె ఆ మధుర స్వరం ముందు నా స్వరమెంత చెప్పండి! నా పనేమిటో కూడ మర్చిపోయి నేను పాడుకుంటూ కూర్చున్నాను" అన్నాడు. నిరు మాట్లాడకుండా బొమ్మలా చూస్తూ కూర్చుంది. నిరు బాగా పాడలేదని కమలకు తెలుసు. అందువల్ల యిదేదో పరిహాసానికంటున్నాడనుకొని "తరువాత?" అంది అతడి ముఖంలోకి చూస్తూ.

"తరువాత అసలు సత్యం తెలుసుకుని నాకు మార్గాన్ని చూపెట్టింది" అనేసి నవ్వాడు.

కమల నవ్వుతూ నిరు ముఖంలోకి చూచి, "చాల సేపైంది. నడు పోదాం. ఇంకా డాక్టరు పాట వినాలి" అని తీక్ష్ణంగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ, "ఇంకా యేమైనా అనాటిది మిగిలిపోతే పూర్తి చేద్దువుగాని" అంది.

ఇంతలో సావిత్రిదేవి పళ్లెంలో ఫలహారం తీసుకు వచ్చి కమల ముందర పెట్టింది. "ఈ సమయంలో నేనేమీ తిననండి" అని ప్రక్కనున్న తమలపాకుల పళ్లెంలోని ఏలక్కాయ తీసుకుని, వెడతానంటూ లేచింది. నిరు మనస్సులో యేదో తెలియని అశాంతి, ఆవేదన బయల్దేరాయి. అయినా నిగ్రహించుకుని, అంది - "లేదు కమలా నేను యింటికి వెళ్లాలి. ఇంకా పనుంది" అంటూ లేచి సావిత్రిదేవికి నమస్కరించింది. సావిత్రిదేవి హృదయం ఎందుకో తెలియని గాఢానురాగంతో నిండిపోయింది. "మళ్లీ మీ దర్శనం కోసం యెదురుచూస్తూ వుంటాను" అన్నట్లుగా నిరు కళ్లల్లోకి చూచి గుమ్మందాకా సాగనంపింది. నీలి ఒక్కసారి కమలవైపు కోపంగా చూచి అక్కగారి వెనకనే వెళ్లిపోయింది. నీలి తనవైపు అంత కోపంగా చూచిందేమిటా అని అర్థంకాక ఆలోచిస్తూ వెళ్లిపోతున్న నిరువైపు చూస్తూ కూర్చుంది కమల.

"ఇదంతా అంధకారం. దృష్టి కన్పించదు" అనుకొంటూ కూర్చున్నాడు కుమార్. కమల కొద్దిసేపు సావిత్రిదేవితో మాట్లాడి కుమార్‌ను తీసుకుని బైటికి వెళ్లిపోయింది.

## 21

"నీలీ" అంటూ పిలిచాడు యోగీష్‌బాబు. బైటికి వెడుతున్న నీలి ఆగిపోయి తల వెనక్కు త్రిప్పి హాలులో ఒకమూల కూర్చున్న తండ్రివైపు చూచింది. "ఒకమాట — యిల్లారా" అన్నాడు యేదో బ్రహ్మాండమైన రహస్యం చెప్పేవాడిలాగ. దగ్గరకు వచ్చిన నీలిని ప్రక్కన కూర్చోబెట్టుకుని వీపుమీద చెయ్యివేసి నిమురుతూ, "నీవు చాల తుంటరిదానవై పోయావు కదూ!... నిన్న నిన్ను బజారుకు తీసుకు వెళ్లి అన్నీ కొనిపెడదామనుకున్నాను... నువ్వెక్కడా కన్పించలేదు" అంటూ ప్రశ్నార్థకంగా ఆమె ముఖంలోకి చూచాడు.

(సశేషము)

# మతకర్తలు: తద్భక్తిభేదములు

శ్రీ వేదం వేంకటకృష్ణశర్మ

(గత సంచిక తరువాయి)



## గోస్వామి తులసీదాసు

సాక్షాత్తుగా భగవంతుడుగాని, ఆయన వార్తావహులయిన ప్రచారకులుగాని, యీలోకమున మర్త్యులకు సన్నిధానవర్తులుగా నుండవలసిన యవసరము తటస్థించినప్పుడును, ప్రతికూల పరిస్థితులు ప్రజాపీడలకు దారితీయునప్పుడును లోకులు కాల వైపరీత్యమున నిరాశాపూరితులై నిరాశ్రయులై—ఇక దైవమే తమకు శరణ్యమని కింకర్తవ్యతా మూఢులై (తమ) జీవితము అతి దుర్భరముగ సాగించువారై నిత్యదుఃఖితులై—యున్న సమయములలో భగవంతుడు మానవులమధ్య మెలగుటకు కవతరింపక తప్పదు. అట్టియెడ దమ దౌర్భాగ్యస్థితిలో తమ జీవితమున భగవంతుడొక్కడే దమ యాశ్రయభూతుడని మనస్ఫూర్తిగ విశ్వసించి త్రికరణశుద్ధిగ ఆయనను అంటిపట్టుకొని యుందురు. ఆరీతి భారతీయులు శారీరకముగనే గాక ఆధ్యాత్మికముగను భగవదనుగ్రహ మందుట ప్రయత్నింతురు. ఇందులకు బెక్కు నిదర్శనములు, మన మత చారిత్రిక గ్రంథములందంతటను గాంచ నగును. ప్రజలు మానసికముగ ఆర్తోన్నతికై ఎలుగెత్తి ఎప్పుడు తన్ను బిలిచి మొఱలిడ మొదలిడుదురో వారలకొసమ్ముఖముగ ఆప్రభువు పాదపీఠముసన్నిధి నలంకరింతురు. వెంటనే భగవానుడు వారిని అజ్ఞానాంధకారమునుండి తొలగించి—యోదార్చి మనశ్శాంతి జేకూర్చును. భారతదేశములోని పరిస్థితులు క్లిష్టములుగను, పీడాకరములుగను ఉన్న సమయముననే తులసీదాసుడు అవతరించెను. ఆ కాలమునందు ప్రజాసమూహమున కంతకు ముందెన్నడును అట్టి దురవస్థలేమాత్రము సంభవించినవి కావు.—నిరాశ—నిస్పృహ—నిస్సహాయత వారి మోములలో దాండవింపజొచ్చెను. వారి జీవితాకాశమున నెల్లడ అజ్ఞానాంధకారము ఆవరించి—అందుండి వెలువడు మార్గ మగపడకుండెను. అట్టియదనున జన్మించిన తులసీదాసు దైవతేజోవిలసనమున ఆధ్యాత్మికశక్తికి భారతీయులు పనుపడునట్లొనర్చెను. హైందవ దేశ మందలి తోడి సోదరులలో బాలమందిని దన నిరం

ల

తరోపదేశముల పరమార్థమును దెలుపుటచే ప్రబుద్ధులొనర్చి శ్రీరామచంద్రునిగ గడుంగడు భక్తితో త్రికరణశుద్ధిగ ఆశ్రయించి యర్చించునట్లు సలిపెను. అతని బోధనలాలించినవారు శ్రీరాముని అయోధ్యాధీశునిగను—ఆదర్శపురుషునిగను భావించి, తత్ప్రభావ జిజ్ఞాసువులయి, అతనియం దత్యంత ప్రపత్తులై నెఱపుచు, ఆదేవదేవుని పవిత్రనామ జపపరాయణులై, ఆయన దివ్యసుందర సురుచిర రూపసందర్శనమునకై తహతహలాడిరి. అట్టి భక్త సమూహమున కాయన, ముంగొంగు బంగారముగను, ముంగిటి పెన్నిధానముగను ప్రకాశించెను. భగవంతుడు భక్తుల కెవ్వరికిని ఎప్పుడును దూరగుడు గాడనియు, వాస్తవముగ ఆయన వారియందే యున్నాడనియు, నిశ్చల చిత్తముతో భజించువారి కాయన సాక్షాత్కారము దుర్లభము గాదనియు, జక్కగ బరామర్శించుచో ఆయనయు, దదంతరంగభక్తుడును భిన్నవ్యక్తులు కాక ఒకే నాణెముయొక్క రెండు దిక్కులవంటివారనియు తులసీదాసు సిద్ధాంతము.

తులసీదాసునకు ముందు—గ్రంథకర్తలని అనిపించుకొన్న హిందీకవులు తామాశ్రయించిన పోషకుల యొక్కయు, చిన్నచిన్న భూభాగముల కధికారులైన జాగీరుదారులయొక్కయు గొప్పతనములను గూర్చి వర్ణనాతిశయములతో గీర్తించిరి. అంతియగాక, వారట్టి ఱేండ్ల యాస్థానకవులుగ భావించి వారి జీవితములను విజయపరంపరలను కవితావస్తువులుగ స్వీకరించి, తమ కృతులను వెలయించుచుండిరి. ఐహిక సౌఖ్యదాయక భోగములనెల్ల నిర్జించిన తులసీదాసు కేవలము ఇహలోకమున రవంత నేలను రాజులయినంత మాత్రమున విఱ్ఱవీగు నరరూప ధనదాసుల కతడు తల యొగ్గినవాడు కాడు. మహాభక్తుడగుటచే స్వాతిశయ ప్రకటనమున కాతడెన్నడును పూనుకొనలేదు.

కావుననే, అతడసాధారణ రీతి 126 ఏండ్ల ఆయుఃపరిమితమగు దీర్ఘకాలము జీవించియు, దజ్జ

వితని శేషములు చాలకాలందిగనే ప్రపంచ వ్యాప్తములు అయినవి. అతని కృతులలో వ్యక్తిగతముగ నతనిఁగూర్చి తెలుపుపట్టులు మిక్కిలి అరుదుగఁ గనఁబడును. కాని అందతని వినమ్రతయు, భక్తిప్రపత్తియు, నిశ్చల వైరాగ్యముఁ దప్పఁ దక్కిన యంశము లేవియుఁ దెలియవచ్చుట లేదు.

గోస్వామి, మొట్టమొదట సంస్కృతభాషలో శ్లోకరూపముగ రామాయణముం జెప్పిన వాల్మీకి మహర్షియొక్క అపరావతారమను ప్రథ ఆర్యావర్తమునఁ జిరకాలముగఁ గలదు. అతఁడు 1554 సం॥ శ్రావణ శుద్ధ ౭.నాఁడు 'బందా' (ఐక్యమాగాణము) మండల మందలి రాజపూరులో బ్రాహ్మణ శాఖలలో ఒకటి యగు 'సరజూపురీణ' తెగలో ఉదయించెను. అతని తండ్రి ఆత్మారామ ద్యూబే; తల్లి 'హుల్సి'- అనుసాధ్వి. అతఁడు మాతృగర్భమునుండి జనించునెడ, సాధారణ శిశువులవలె రోదనమొక్కింతయు లేక, తక్కిన దంతములు ముప్పదిరెంటిని స్పృశింపని పండ్లజంటతో భూపతన మయ్యెను. మూలానక్షత్రము- చంద్రగ్రహము గలసియుండునపు డాతఁడు పుట్టుటచే అతనికే కాక అతని తలిదండ్రులకును ఘోరవిపత్తు సంభవించునని దైవజ్ఞులు వచించిరి. చిన్నప్పుడాతనికిఁ బెట్టఁబడిన పేరు తులారాముఁడు.

1583 సం॥ జ్యేష్ఠ శుద్ధత్రయోదశిని- అతఁడు బుద్ధివతి- యను కన్యను బెండ్లాడెను. ఆధర్మపత్ని యందు తులారాముఁడు. అత్యంత వ్యామోహము గలవాఁడై, ఒకనాఁడేని సతి నెడబాసి యుండకుండెను. ఒకనాడాతరుణి పుట్టినింటికేఁగెను. దాని నెఱింగిన తులసీదాసామె విప్రంభము సహింపలేక, అనిశీథమున నొంటరిగ నింట నెరికిని దెలియని విధమున నత్తవారింటికి హుటాహుటి నేగి యటఁ దనసతీమణిని రహస్యముగ మేల్కొలిపెను. అర్ధమఱేయి నిట్లు చరించిన మగని సిగ్గుమాలిన ప్రవర్తనమునకు ఆయువతి- యేవగొని, తలవ్రాల్చి, ప్రాణేశ్వరునితో ఇట్లనెను:— "మాంసాస్థి మయ పంజరమగు నావినశ్వరశరీరముపై మీకుఁ గల ప్రేమలో సాఁబాలు భగవంతుఁడగు శ్రీరామచంద్రునిపై నుంచితిరేని, భవసాగరము నుత్తరించి,— జననమరణ భీతినుండి విముక్తి గాంతురుగదా!"

(సశేషము)



Grams: 'LODHRA' Phone: 86637

# Grihalakshmi

*Illustrated Telugu Monthly*

Published on every 15th

**Advt. Rates**

| | |
|---|---|
| Ordinary page | ... Rs. 60/- |
| 2nd Wrapper single colour | ... Rs. 80/- |
| 3rd ,, ,, | ... Rs. 80/- |
| 4th ,, ,, | ... Rs. 100/- |

*Only mounted blocks are accepted.*
*Halftones not finer than 75 screens.*

Last date for receiving advt. lay-outs and blocks—15 days in advance of the date of publication.

All communications and materials may be addressed to:

THE ADVT. MANAGER,
"Grihalakshmi"
Royapettah, Madras-14.

(216 వ-పేజి తరువాయి)

కెమెరాను స్విచ్ ఆన్‌చేశాడు. ఈ నూతన చిత్రానికి శ్రీ జి. రామినీడు దర్శకత్వము నిర్వహిస్తున్నారు. అశ్వద్ధామ సంగీతము నిర్వహిస్తారట.

♦ ♦ ♦

## "శ్రీ కృష్ణ పాండవ యుద్ధం"

పెనుశిలా ప్రొడక్షన్స్ వారు సమర్పించు ఈ మహత్తర పౌరాణిక చిత్రం మే నెల విడుదలకు సర్వ సన్నాహాలతో సిద్ధమౌతోంది. ఈ చిత్రానికి శ్రీ అనిసెట్టిగారి మాటలు, పాటలు, శ్రీ రంగారావు సంగీతం, ట్రిక్ ఫోటోగ్రాఫీ ప్రత్యేకాకర్షణలు.

నళినీ జయవంత్, మహిపాల్, సాహుమోడక్, సులోచన మున్నగువారు నటించిన ఈ చిత్రానికి నిర్మాతలు, డి. పి. నాయుడు & కె. ఎల్. చౌదరి, యింటర్ నేషనల్ పిక్చర్సు (విజయవాడ) వారు ఈ చిత్రాన్ని ఆంధ్రలో విడుదలచేస్తారు.

## "వీర జగ్గడు"

అశేష ఆంధ్ర ప్రేక్షక లోకానికి "గాంధారి గర్వభంగం" లాంటి అత్యుత్తమ పౌరాణిక చిత్రాన్ని సమర్పించిన శ్రీ కృష్ణసాయి ఫిలిమ్సువారు "వీర జగ్గడు" అను మహత్తర జానపద చిత్రాన్ని అతి త్వరలో ఆంధ్ర ప్రదేశమంతటా విడుదల చేస్తారు. 18.4.60 న ఈ చిత్రాన్ని సెన్సార్ చేశారు. ఏ. ఎం. రాజా, జిక్కి, సుశీల, మున్నగు వారు పాడిన పాటలు, ఆరుద్ర రచన, పామర్తి సంగీతం, గగుర్పొడిచే కత్తి యుద్ధాలు, మంత్ర ముగ్ధుల్నిగావించే మహేంద్ర జాలం ఈ చిత్రానికి ప్రత్యేకాకర్షణలు. నిర్మాత యర్రా అప్పారావు, (తణుకు.)



జగపతి పిక్చర్స వారి 'అన్నపూర్ణ' చిత్రంలో ముసిముసి నవ్వులతో మురిపిస్తున్న జమున

## కేసరిగారి జన్మదినోత్సవ దృశ్యం



ఉద్యోగ బృందమునకు వస్త్రములు నిచ్చుచున్నప్పటి దృశ్యము

# బాబా భక్తుడు స్వామి కేశవయ్యాజీ మహిమ

శ్రీ డి. వి. రమణయ్య

—— (౦) ——

షిర్డీ, సాయిబాబా - ఈ రెండు పదాలు ఒకదానికొకటి తోడు అయినవి. షిర్డీ చాలా పవిత్రమైన స్థలం. కనుకనే సాయిబాబా అక్కడ తన నివాసం ఏర్పాటు చేసుకున్నారు. వేల సంఖ్యలో భక్తులు అక్కడికి వెళ్తూ ఉంటారు. ఈ భక్తులలో రకరకాల వారున్నారు. వీరు అనేక అపేక్షలతో వస్తూ ఉంటారు. శ్రీ సాయిబాబాతోనే పొందిన అనుభవాలను బట్టి ఆయన మహాగొప్ప యోగి అని చెప్పగలను. బాబాను గురించి నేను వర్తమాన కాలంలో వ్రాస్తున్నాను. అందుకు కారణం లేకపోలేదు. బాబా ఇప్పటికీ ఆయన సమాధినుంచి మాట్లాడుతూ ఉంటారు. బాబా దర్శనార్థం వచ్చినవాళ్ళు ఎవ్వరూ అసంతృప్తి చెంది వెళ్ళలేదు.

బాబా వలెనె, బాబా భక్తులున్నూ మహిమ గలవారు. బాబా అనుగ్రహాన్ని పొందిన ఒక ప్రముఖ భక్తునితో నా అనుభవాలను కొన్ని వివరిస్తాను. నా అనుభవాలు అత్యద్భుతములైనవి. ఆ భక్తుడు స్వామి కేశవయ్యాజీ. వీరు శ్రీ యస్. బి. కేశవయ్యగా షిర్డీ వస్తూ వున్న రోజులలో నేను వీర్ని కలిసినాను. భక్తిమార్గంలో వారెంతో ముందుకు వెళ్లారు. ఇప్పుడు వారు స్వామి కేశవయ్యాజీ అయినారు. ఇందులో ఆశ్చర్యంలేదు. వీరిని స్వయంగా కలుసుకునే అవకాశంలేనందువల్ల నేనుజాబులద్వారా వీరి పరిచయాన్ని సంపాదించి, ఆ పరిచయాన్ని కాపాడుకుంటూ వచ్చాను.

గురువారం నాడు వీరు మద్రాసు షెనాయ్ నగరంలోని సాయినిలయంలో చేసే పూజలు, పూజానంతరం వారిచ్చే ప్రసాదంవల్ల కలిగే ఫలితాలు ప్రసిద్ధికెక్కినవి. స్వామి కేశవయ్యాజీని గురించి వ్రాయాలనే ఉత్సాహం కలగడానికి రెండు పర్యాయములు నాకుకలిగిన అనుభవాలే! మొదటి అనుభవం నాకు 1956 వ సంవత్సరంలో కల్గింది.

ఏ పాపం యెరుగని నామీద విధి విర్చుకుపడింది. ఆ దెబ్బతో నేను అధఃపాతాళానికి పోవలసినవాడ్ని. నేను నా నిరపరాధిత్వమును వివరిస్తూ పరిస్థితులను విశదపరుస్తూ స్వామి కేశవయ్యాజీకి వ్రాసుకున్నాను. కోపర్‌గాన్‌లో ఉంటున్నందువల్ల షిర్డీకి కూడా వెళ్ళివస్తూ ఉండేవాడ్ని. నా నమ్మకానికి అదొక పరీక్ష అయింది. శ్రీ సాయిబాబాలో ఆయన కృపలో నాకు అచంచలమైన విశ్వాసం ఉంది.

ఒకరోజున స్వామి కేశవయ్యాజీ నుంచి లేఖ వచ్చింది. ఆ లేఖలోని విషయాలు నాలో ఒక విధమైన ఉద్వేగాన్ని, ఉత్సాహాన్ని కల్గించినవి. స్వార్థపరులైన కొందరి ఎత్తులవల్ల నన్ను కోపర్‌గాన్ స్టేషన్ నుంచి ఏదో ఒక చిన్న స్టేషనుకు మార్చడానికి పైఅధికారులు ఆలోచనలు చేస్తున్నారు. ధర్మం జయిస్తుందనే విశ్వాసం ఉన్నప్పటికీ చివరికి ఏమవుతుందో అన్న అనుమానంకూడా ఉంది. "శ్రీ సాయిబాబాను గురించి ఎలాంటి అనుమానాలు పెట్టకోవద్దు. బాబా భక్తులు బాధలకు లోనుకారు. పైఅధికారుల సహాయాన్ని అర్థించి ఈబదిలీని ఆపుకోవచ్చును; కాని, అది బాబాలో నమ్మకంలేక పోవడాన్ని సూచిస్తుంది. మీరు బదిలీ అయినా, అది ప్రమోషనుగా ఉంటుంది" అని స్వామి కేశవయ్యాజీ చెప్పారు.

సరిగ్గా అలాగే జరిగింది. నాకు బదిలీ తప్పలేదు. అయితే ఆ ఉద్యోగం, చేస్తున్న ఉద్యోగంకంటే పెద్దది. శ్రీ సాయిబాబా స్వామి కేశవయ్యాజీ ద్వారా పనిచేస్తూ ఉంటారు. ఇద్దరూ మహానుభావులే! "యత్రగాయంతేమత్భక్తతత్రతిష్టామి" అని మహావిష్ణువు నారదునికి చెప్పలేదా?

మూడు సంవత్సరాలు అనేక ప్రదేశాల్లో పనిచేసి - ఈ ప్రదేశాలన్నీ షిర్డీకి సమీపంగానే ఉన్నవి - తిరిగి ఒక కొత్త సమస్యను ఎదుర్కోవలసివచ్చింది. ప్రమోషను ఇచ్చి నన్ను సికింద్రాబాదు వెళ్ళమన్నారు. షిర్డీ పరిసరాలను వదలి సికిందరాబాదు వెళ్ళడం ఇష్టంలేదు. ఈ బదిలీ ఉత్తరువులు మార్చడం అంటే ఇటు సూర్యుడు అటు పొడవడమే! ఆదేశాలను శిరసావహించి నేను సికింద్రాబాద్ వెళ్ళవలసిందే! పునర్విచారణావకాశంకూడా లేదు. అయితే పూర్వపు అనుభవాలనుబట్టి నాకు కొంత ఆశవుంది. 1959వ సంవత్సరమున ఆగస్టు నెల 28వ తేదీన నాకు స్వామి కేశవయ్యాజీ నుంచి ఒక జాబు వచ్చింది. నన్ను సికింద్రాబాద్‌కు బదిలీ చేయరని, చేసినా మూడు మాసాల్లోనే తిరిగి యథాస్థానానికి రాగలనని వారు

(238వ - పేజీ చూడుడు)

# స్వీకారము

**శ్రీరామ స్తోత్రావళి: అనువాదం - శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి, ప్రచురణకర్తలు: ఆధ్యాత్మ ప్రచారక సంఘం, విక్రమహాలు, రాజమండ్రి. వెల 0.25.**

ఇందులో సంస్కృత మూలముతో సహా శ్రీ సీతారామాష్టకం, రామాష్టకం, ప్రాతఃస్మరణము, ఇంద్రకృత శ్రీరామస్తోత్రం, శ్రీరామచంద్రాష్టకం, జటాయుకృత శ్రీరామస్తుతి, శ్రీరామస్తుతి, బ్రహ్మదేవకృత శ్రీరామస్తుతి, శ్రీరామ ప్రేమాష్టకం అనువాదము కలదు. సర్వ పాపహరము, సర్వ సుఖ సౌభాగ్యములనిచ్చు రామనామ స్మరణకని యుద్దేశించిన యీ పుస్తకము అర్థసయితముగా నుండుటచే అమూల్యమైనది.

**ఆకుండి వ్యాసమూర్తిశాస్త్రిగారి జీవిత చరిత: శ్రీ వేదుల శ్రీరామచంద్ర కీర్తి. ప్రకటనకర్త: శ్రీ ఆకుండి వేంకటశాస్త్రి, కీర్తి సదనము, కాకరపర్రు, ప॥ గోదావరి జిల్లా వెల 0.50**

శ్రీ శాస్త్రిగారు మహా విద్వాంసులు. సంస్కృతాంధ్రములందసమాన పాండిత్యముతో బాటు అనేక శాస్త్రములు కరతలామలకములగుటచే అనేకమంది శిష్యులు సుశిక్షితులయిరి. ఇట్టి మహనీయుని ప్రజ్ఞా పాండిత్యాలు, సాహిత్యసేవ అనుభవ, విజ్ఞానములు తరతరాలకు ఆదర్శ ప్రాయమగుటచే వారి జీవిత విశేషాలు గ్రంథ రూపంగా వెలువడటం సంతోషింప తగిన విషయము. అందులోను గ్రంథకర్త దౌహిత్రుడై, ప్రకటనకర్త కుమారుడగుటచే యిందలి విషయాలు, వివరాలు సమగ్రమైనవై బహుళోపయుక్తంగా రూపొంది యుంటుంది. సాహిత్య ప్రియులకు, సేవకులకు, పండిత పామరులకు యీ గ్రంథము మూలముగా శ్రీ వ్యాసమూర్తి శాస్త్రిగారి జీవితమును గురించి అనేక విషయాలు తెలియగలవు.

**మన వైదేశిక విధానము: ఆచార్య శ్రీ మామిడిపూడి వేంకటరంగయ్య. తెలుగు విద్యార్థి ప్రచురణలు, మచిలీపట్నము, వెల 60 నయా పైసాలు.**

మన భారత వైదేశిక విధానమును గురించి విరివిగా తర్జనభర్జనలు జరుగుతున్న యీ రోజులలో రాజకీయ శాస్త్ర పండితులు, అనుభవజ్ఞులు శ్రీ వేంకటరంగయ్యగారు యీ చిన్న పుస్తకమును రచించడంవల్ల సరైన మార్గంలో ఆలోచించడానికి పాఠకులకు మార్గదర్శకము కాగలదు. ఇందులో మన తాటస్థ్య విధానమును వివరిస్తూ చైనా దురాక్రమణ, సంప్రదింపులు - బలప్రయోగముల సంగతి సందర్భాలు, తత్ఫలితాలు సయితము నిరూపిస్తూ, ప్రస్తుత మన విధానంలో చేసికోతగిన మార్పునుకూడ సూచించారు. ఇది జాతీయ సమస్యల పట్ల ఆసక్తిగల వారెల్లరు చదువతగినది.

**ద్వర్ధి (ఖండకావ్యము): శ్రీ మంచికంటి వెంకటేశ్వరరావు, సంతగుడిపాడు, నరసరావుపేట తాలూకా, గుంటూరు జిల్లా. వెల 50 న. పై.లు.**

ఇందలి శీర్షికలు అవతార పురుషులను, ఆచార్యులను, చరితార్థులను జాతీయతను కీర్తించుటతో బాటు పురాణలౌకికజ్ఞానమును వెదజల్లుచు చరిత్రాంశములను సయితము వివరించుచున్నవి. కవిత్వము బహుసరళముగా నుండి మనోజ్ఞంగా సాగింది. భావముల పొందిక అనువుగానున్నది.



(237 వ పేజీ తరువాయి)

స్పష్టంగాచెప్పారు. స్వామి కేశవయ్యజీ మాటల్లో నాకు పూర్తి విశ్వాసం ఉంది. అయినా ఉత్తరువులు మారడం కష్టం. పరిస్థితులు కొంత అనుకూలంగా ఉన్నవి. చాలా రోజులు అధికారుల ఉత్తరువులు నాకు అందలేదు. సరిగ్గా మూడు మాసాలకు అనగా 1959 నవంబరు 28వ నాకు సరికొత్తగా బదిలీఉత్తరువులను రద్దు చేసి కొపర్‌గాన్‌కు బదిలీచేస్తూ ఉత్తరువులు వచ్చినవి. ఇది విధికృతమా? కాదు బాబా కృతం! బాబా అనుగ్రహం, స్వామీజీ ఆశీర్వాదం.

స్వామిజీ ఉపదేశించే మంత్రం "ఓమ్ శ్రీ సాయి రామ్." ఈ మంత్రం అద్భుతాలను సాధిస్తుంది. షెనాయ్‌నగర్‌లో శ్రీరామనవమి, విజయదశమి ఉత్సవాలు ఎంతో వైభవంగా జరుగుతవి. ఆ ఉత్సవ సమయాల్లో స్వామిజీ దర్శనం చేసుకుని వారి ఆశీర్వాదం పొందగలవారు అదృష్టవంతులు! శ్రీ సాయిబాబా స్వామి కేశవయ్యజీ ద్వారా పనిచేస్తుంటారని నా పరిపూర్ణ విశ్వాసం. బాబాకు, బాబా భక్తుడు స్వామి కేశవయ్యజీకి ఇదే నా నమోవాకములు.

# సంపాదకీయములు

## ప్రభుత్వ రికార్డులలో కులం ప్రసక్తికి స్వస్తి

ప్రభుత్వోద్యోగాలకు, విద్యా సౌకర్యాలకు, కోర్టు వ్యవహారాలకు ఉపయోగించే రిజిస్టర్లు, అర్జీ ఫారాలలో కులం, తెగ వివరాలు ఉదహరించవలసిన అవసరము లేకుండా అందుకు సంబంధించిన భాగాలను తొలగించాలని కేంద్ర ప్రభుత్వము అన్నిరాష్ట్రాలకు సూచించింది. అయితే షెడ్యూల్డ్ వర్గాలను మాత్రం మినహాయించింది.

ఈ సూచన ఫలితంగా వివిధరంగాలలో కుల, వర్గ ప్రభావం చలాయిస్తున్న అవాంఛనీయమైన అధికార, ఆధిపత్యముల ఉధృతము తగ్గవచ్చు. కులాల ప్రసక్తిని తెచ్చే వ్యక్తులపేర్ల చివరి భాగాలనుకూడ స్వస్తిచెప్పిస్తే కేంద్ర ప్రభుత్వ లక్ష్యం మరింత సుగమంగా సిద్ధించవచ్చును.

షెడ్యూల్డ్ తరగతులవారికైనా కులం ప్రసక్తి మహదావకాశంగా చాలకాలం ఉండటం సమంజసము కాదేమో! అంటే తమ కనుగుతున్న ప్రత్యేకావకాశములతో విద్యాధికులై, అభివృద్ధి అభ్యుదయాలు యితరులతో సమానంగా సిద్ధించిన తరువాత సయితము శాశ్వతంగా 'కులం'ను అవకాశంగా తీసికోవాలనుకోడం ఉమ్మడి శ్రేయస్సును ప్రోత్సహించదు.

## దొంగ వ్యాపారానికి కారణం ?

దొంగ వ్యాపారానికి ఉద్యోగులే కారణమని రాష్ట్ర వస్త్ర వ్యాపారుల సభలో మాజీ జడ్జి కృష్ణయ్య చెట్టి విమర్శించారు.

దొంగ వ్యాపారానికి కారణం వ్యాపారుల అధిక లాభాపేక్ష, వినియోగదార్ల అవసరాలుకూడ కారణమేకాని ఒక్క ఉద్యోగులు మాత్రమే కాదు.

ప్రజల అవసరాల ననుసరించి ఉత్పత్తి పంపిణీ సరసమయిన ధరలకు జరుగుతున్నదీ లేనిదీ పారజూచి ప్రభుత్వము వానిని సమకూర్చకలిగినచో దొంగవ్యాపారము చాలవరకు మాయం కాగలదు.

## ఇంటితోటల పెంపకం

ఇంటి చుట్టూయున్న స్థలాలన్ని ఫల పుష్పతోట పెంపకానికి వినియోగించడమువల్ల యింటికి శోభ యింట్లోవారికి ఆరోగ్య సౌభాగ్యాలు సమకూరుతవి.

ఇంటి తోటలలో యింటిల్లిపాది శక్తి సామర్థ్యాలననుసరించి కృషిచేయడం అనేకవిధాల లాభకరం తమ యింటి అవసరాలకు కాయగూరలు, పండ్లు, పుష్పాలు లభించడమే కాకుండా అదనంగా మిగిలిన వానిని అమ్మించడంవల్ల రాబడికూడ యుంటుంది. తోటయున్న యిల్లు ఆరోగ్య నిలయం కావడానికి అవకాశాలు అనేకం. ఇట్టి తోటల పెంపకానికి పెట్టుబడియంటూకూడ ఎక్కువ అవసరముండదు.

ముఖ్యంగా మన ఆంధ్ర దేశంలో యిట్టి యింటి తోటలపట్ల ఆసక్తి, మోజు తక్కువ. ఇందుకు కారణం వాని విలువ తెలియక కొంత, నిర్లక్ష్యం కొంత, సోమరితనము కొంతయని చెప్పాలి. ఇకనైనా ఇంటి తోటల ప్రాధాన్యాన్ని గుర్తించడమువలన స్వీయ సౌభాగ్యము పెంపొందించుకోడం అత్యవసరము.

## స్త్రీ పురుషులకు సమాన వేతనాలు

అంతర్జాతీయ కార్మిక సంస్థ సూచన ననుసరించి స్త్రీలు, పురుషులు చేసే సమానమైన పనికి సమాన వేతనాలు యిచ్చేందుకు వీలుగా తగుచర్యలు తీసికోవాలని ప్రభుత్వానికి లోక్‌సభ అంచనాల సంఘం కోరింది.

ఈ సిఫారసును పరిశీలించేటప్పుడు స్త్రీలు, పురుషులు జేసే సమానమైన పనికే సమాన వేతనాలన్న విషయం గుర్తించతగింది. పురుషులతో సమానంగా స్త్రీలు పనిచేసేటప్పుడు సమాన వేతనాలివ్వడమునకు ఎట్టి అభ్యంతరము ఉండరాదనేది వివాద రహితమైన సూచన. కాని వివిధ పరిశ్రమలలో పురుషులతో సమానంగా స్త్రీలు పని చేయుచున్నారా, లేక పని చేయగలరా యనే విషయాలను నిర్ణయించవలసివచ్చేసరికి సమాన వేతనాలివ్వాలనే సూచన బలీయంగా నిలవదేమో! కాబట్టి కాయకష్టంతో కూడిన పనులలో స్త్రీల శక్తిసామర్థ్యాలను, సహజ ప్రకృతిని దృష్టిలో నుంచుకొని పరిశ్రమలలో వినియోగించుకొని స్త్రీ పురుషులకు సమానమైన వేతనాలను సమానమైన పనికి నిర్ణయించడం మంచిది.

---

# త్యాగరాజస్వామి

భక్త శిఖామణి త్యాగరాజస్వామి, నిస్స్వార్థంగా పరమాత్మకు ఆత్మను అర్పణంచేసి భగవన్నిర్ణయానికి బద్ధుడైన పూర్ణపురుషుడు. ఆయన కృతులు పరమాత్మను కీర్తించడముతో బాటు చిత్తశుద్ధితో ఆత్మ నివేదనను ప్రోత్సహించునట్టివి. త్యాగరాజ కృతులు తన్మయత్వంతో బాటు పచ్ఛలము, శ్రద్ధాసక్తులు, సేవా త్యాగములను పూరిస్తూ పరమాత్మతో ఐక్యము కావడానికవసరమయిన భక్తిని పెంపుచేయునవి. భక్తి మార్గం మానవ జీవితయాత్రను తీర్చి దిద్ది పూర్ణ పురుషునిగాను, పరమాత్ముని అనుగ్రహ కటాక్షములకు పాత్రుడుగాను రూపొందించునది. కాబట్టే భక్తి మార్గం రాజబాట వంటిది. అందలి జీవయాత్ర యిహపరాలలో సుఖపడడానికి అనువగు నైతిక, ఆధ్యాత్మిక, పరమార్థిక చింతలతో కూడినదై రక్తి ముక్తిదాయకమైనది. సంగీత సాహిత్యాలు శ్రద్ధా భక్తులతో భగవంతుని కీర్తించి, సేవించి ధన్యులగుటకు వినియోగపడుటను నిరూపించినవారు శ్రీ త్యాగరాజ స్వాములు. వారనుభవించి, యితరులకు తన అనుభవముద్వారా పరమాత్మ అనుగ్రహ కటాక్షముల సిద్ధికి రాజమార్గము చూపిన పుణ్యపురుషుడు.

త్యాగరాజకృతులు ఏ భాషలోనివైనా వానిని గానంచేయడానికో, అందలి సాహిత్యాన్ని స్వీయ సౌభాగ్యానికి, ఉద్ధరణకు వినియోగించుకోడానికో భాషా భేదము కాని, ద్వేషం కాని అడ్డురాకూడదు. శ్రీ సి. రాజగోపాలాచారి చెప్పినట్లు "అజరామరమైన తన కృతులద్వారా శ్రీరామచంద్రునకు శాశ్వతమైన ఆరాధనాలయములను నిర్మించాడు. ఆయన వ్రాసిన ప్రతిపాట సీతారాముల కంకితమైన సుందర ఆలయము. ఈ కృతులను గానం చేసినప్పుడెల్లా మనం మళ్ళీ వీటిని నిర్మిస్తున్నాం"

ఉపరాష్ట్రపతి డా॥ రాధాకృష్ణ "మన జీవితాల ద్వారాను, కృషిద్వారాను రానున్న తరతరాలవారికి మహత్తర ఆధ్యాత్మిక వారసత్వాన్ని అందజేసిన మహర్షులలో శ్రీ త్యాగరాజస్వామియొకరు" అని వెల్లడించడములోని సత్యాన్ని గుర్తించవలసిన ఆవశ్యకత ఎంతైనా యున్నది. ఆయన కృతులు భావనా పటిమతోను, ఆవేశాతిశయంతోను. ఆత్మ నివేదనకు మార్గం చూపుతున్నవి. శ్రీ స్వామి భక్తుడుగా, గాయకుడుగా, తన కృతుల సాహిత్యాన్ని ఉత్తమోత్తమమయిన ఆదర్శ లక్ష్యాల సిద్ధికని యుద్దేశించి, తదనుగుణంగా తాను జీవయాత్ర గడిపి, తన హయాంలోను తర్వాతకూడా మానవకోటికి విజ్ఞాన సుఖాలు అమరడానికి నిర్విరామంగా, నిస్స్వార్థంగా కృషి చేశారు.

అంతేకాదు - సంగీత సాహిత్యాల అభివృద్ధిని త్యాగరాజ కృతులు అనుక్షణం ప్రోత్సహించునవే కాక కళారాధనకు, పిపాసకు విశేషంగా తోడ్పడునవి.

త్యాగరాజ కృతులను రాగ, తాళయుక్తంగా శ్రావ్యగానం చేయడంతో బాటు అందలి సాహిత్యానుగుణంగా జీవితాలను తీర్చి దిద్దుకోకలిగినచో మానవుల స్థాయి యీనాటికంటె అన్నివిధాల మెరుగైనది కాగలదు.

'పరివ్రాజకుడు'

---

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor · C. C. Punniah.
Proprietors: Kesari Kuteeram (Private) Ltd.











తిరుత్తనిలోని శ్రీ సుబ్రహ్మణ్యేశ్వరుని ఆలయదృశ్యములు. ఈ సుప్రసిద్ధ శైవక్షేత్రము
ఈ మధ్యనే ఆంధ్రప్రదేశ్ నుండి మద్రాసు రాష్ట్రమునకు బదిలీ అయినది

By Mr. S. T. Arasu

60
సంవత్సరాలుగా
స్త్రీ జనులతో
సన్నిహిత
బాంధవ్యము
కలది




లోధ్ర

స్త్రీల ఆరోగ్య
సౌభాగ్యములకు

కేసరి కుటీరం
ప్రైవేట్ లిమిటెడ్
రాయపేట, మద్రాసు-14.

SISTA'S